# కావ్యసంగ్రహము

## రెండవభాగము.



సంపాదకుఁడు:

అడిదము-రామారావు పంతులుగారు,

తెలుగు లెక్చరరు, మహారాజవారి కాలేజి, విజయనగరం.



ప్రచురణ:

వేంకటరామ్ అండ్ కో.,

హెడ్డాఫీసు:—ఏలూరు.

1929.

 (వెల 0—8—0

# విషయసూచిక.

# FORE-WORD.



I have always found a difficulty in prescribing suitable text-books under A Group Telugu to be studied by boys of Forms IV & V. The want has constantly been felt for a book of the type of "Selections" published by the S. S. L. C. Board for the Public Examination from year to year. This compilation, consisting of select pieces of poetry from classical authors and the right type of prose, I believe, supplies a long felt want. In view of the increasing importance of the study of vernaculars in both the school and college curricula, and also in view of the present tendency of raising the status of vernaculars, I am of opinion that some more books of this type are absolutely necessary, in as much as it is desirable that our boys should be made to acquaint themselves with the works of Prachina Kavulu and should be made to stndy the right sort of prose and poetry.

It is hoped that Headmasters will welcome the publication of this small book and will avail themselves of it.

VIZIANAGARAM }
23—6—1928 }

S. V. RAMADAS,
*Head Master,*
Maha Rajah's College,
Vizianagaram.

# కవుల జీవిత సంగ్రహము.



౧

**ధూర్జటి:**—ఇతఁడు శివభక్తుఁడు, పాకనాటియాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు. భరద్వాజగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు, కాళహస్తి పురవాసి. ఇతఁడు కృష్ణదేవరాయలకాలములో నున్న ట్లితనివంశములోని వాఁడగు కుమారధూర్జటిరచించిన కృష్ణరాయవిజయమువలనఁ దెలియుచున్నది. కావున 16 వ శతాబ్దారంభమున నుండియుండవలెను. ఇతఁడు కాళహస్తీమాహాత్మ్యమును, కాళహస్తీశ్వరశతకమును రచియించి కాళహస్తీశ్వరున కంకితము చేసెను. ఇతఁడు రాజుల నాశ్రయించిన ట్లితనివంశములోనివా రంగీకరించుటయేఁగాక యీతని శతకమునందు నట్టి మాటలున్నవి. కేవలవేదాంతభావముననో, రాజువలన నితఁ డగౌరవింపఁబడెనో తెలియదు కాని యీతఁడు భౌతికధనాధికముల శతకమున గర్హించియున్నాఁడు. ఇతని తరువాత నితనివంశములోఁ బుత్రులు, మనుమలు, దౌహిత్రులు కూడ మంచి కవులై వారి వంశమునకుఁ గీర్తి తెచ్చుకొనియున్నారు. కాళహస్తీశ్వరుని మహిమలుఁ గల ప్రబంధమును, కాళహస్తీశ్వరశతకమునుఁ గూడ ద్రాక్షాపాకమున నుండి హృదయరంజకముగ నున్నవి. దాక్షిణాత్యకవుల ద్రాక్షాస్ఫురస సమంచితము లగు రచనములీతని వ్రాఁతలలోఁ గన్పట్టుచున్నది. పండితులెఱుఁగని విషయము కాదు.

౨

**దూబగుంట నారాయణకవి:**—ఇతఁడు దూబగుంట కరణము. ఆపస్తంబసూత్ర మైత్రావరుణ గోత్రజుఁడు. బ్రహ్మయామాత్య నాగాంబికలకుఁ బుత్రుఁడు. ఆఱువేల నియోగి. ఇతఁడు పంచతంత్రమును భాషాంతరీకరించి పూసపాటి తమ్మభూపాలునిపుత్రుఁడైన బసవభూపాలుని కంకితమొనర్చెను. ఇతనికి "ప్రబంధవాచికాభరణము" అని బిరుదము కలదు. ఇతఁడు 15 వ శతాబ్దము కడపటిభాగమున నున్నవాఁడు. పంచతంత్ర మింకను భాషాంతరీకరించినవారు కలరు. ఐనను నారాయణ

కవిచే యెక్కుడు ప్రచారము నొందినది. సరసమైనది. ఇతని కృతిపతుల వంశమువారే ప్రస్తుతము విజయనగరాధిపతులు. పూసపాటివారి వంశ చరిత్రము తమ్మభూపాలుని కృష్ణవిజయము వలనను, అతనిపిమ్మట వారు వ్రాసిన ఉషాభ్యుదయమువలనను వివరముగఁ దెలియుచున్నది.

పంచతంత్రము రాజనీతినిఁ దెలుపుకథలుఁగలమంచిగ్రంథము. ఇందలి పాత్రలు చాలవఱకు మృగములు. వాని చర్యలచేఁ గథలు, నీతులు నుండును. మిత్రలాభము, మిత్రభేదము, సంధివిగ్రహము, లబ్ధనాశనము, అసంప్రేక్ష్యకారిత్వమునను పంచతంత్రములును వర్ణింపఁబడినవి. పూర్వ మీ గ్రంథము జమీందారులు, చిన్నప్రభువులు కూడఁ జదివి లాభము లందెడు వారు. మనకున్న రాజనీతి యిదియే యనియు, మన రాజనీతి న్యాయమైనది కాదనియు కొంద ఱాక్షేపింతురు. వారి రాజనీతియెట్టిదో మన మెఱుఁగనిది కాదు. కావునఁ బంచతంత్రనీతినిఁ బద్యరూపమున వ్రాసిన నారాయణామాత్యునిపని శ్లాఘ్యమైనది. ప్రపంచమునం దార్థికాభివృద్ధినిఁ గోరువారి కగత్యమైనది. 3

శంకరకవి:_ఈ కవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రకౌండిన్యగోత్రుఁడు. దేచనామాత్యపుత్రుఁడు. శంకరభక్తుఁడు. ఇతఁడు హరిశ్చంద్రోపాఖ్యానమును ప్రబంధముగా రచియించియున్నాఁడు. ఇతఁడు తన గ్రంథము నీడూరిబాచయమంత్రి కొడుకగు నెల్లయామాత్యునకుఁ గృతి యిచ్చెను. కవులచరిత్ర మీతనికాలము 16 వ శతాబ్దాంత మనుచున్నది. అది విచార్యము. కవి కృతిపతికి బంధుకోటిలోఁ జేరినవాఁడగుట కృతిపతివలెనో కవియు గోదావరీమండలములోనివాఁడని తోఁచుచున్నది. ఉండి, యీడూరుగ్రామముల కాధిపత్యాదిసంబంధములు గల కృతిపతిబంధుఁ డగుకవి బ్రౌనుదొరవారు వ్రాసినట్లు నెల్లూరివాఁడు కాఁడని కవుల చరిత్రము వాదించుచున్నది. ఇదియుఁ జింత్యమే! సాధారణముగా భాషలో ముందు ద్విపదకావ్యములుగాఁ బుట్టినగ్రంథములే పిమ్మట చంపూమార్గమున రచియింపఁబడుచు వచ్చినవి. ఆసూత్ర మిచ్చటఁ గూడ నిలుచు ననుకొనినయెడల నితఁ డీగ్రంథము 15 వ శతాబ్దాంతమందున్న గౌరనకుఁ బిమ్మటనే రచియించియుండె ననవచ్చును. గౌరనకాలము సరిగఁ దెలిసి

నను శంకరకవికాల మింకను సరిగఁ దేలనందున నిదియే సత్య మనుటకుఁ బ్రమాణములు పూజ్యము. భాషనుబట్టి శంకరకవియే యర్వాచీనుఁ డన నగును. హరిశ్చంద్రోపాఖ్యానకథ మిగుల జనసమ్మతి నొందినది. అం దీశంకరకవికృత మైనప్రబంధము గౌరనగ్రంథముకంటె నెక్కుడు వ్యాప్తి నొందినమాట సత్యము. గౌరన భావపటిమకును, శంకరకవి శైలీరమ్యతకును బ్రసిద్ధు లనవచ్చును. ఉభయులు సమానులైనను, విశేషము చెప్పవలసిన నిట్టే యనవలసియుండును. కంచి వీరశరభకవి మొదలైనవారీ కథనే చంపూమార్గమున వ్రాసిరి. వారి కీశంకరకవికి వచ్చినంత వ్యాప్తి కాని కావ్యగుణము కాని రాలేదనుటయే యుక్తముగ గాన్పించుచున్నది. రుచిభేదమున నభిప్రాయభేదములు కూడ నుండవచ్చును.

౪

కంకంటి పాపరాజు:— ఈతఁడు శ్రీవత్సగోత్రుఁడు. అపస్తంబసూత్రుఁడు, అప్పయామాత్యపుత్రుఁడు. ఆఱువేల నియోగి. గ్రంథారంభమున నాఱువేల నియోగులు రాజాస్థానవిహారులనియు, దానకర్ణులనియు, పరోపకారులనియు, స్వామికార్యనిర్వాహకులనియు, విమతగర్వాపహారులనియు వర్ణించుకొని తానట్టి యుత్కృష్టజాతికిఁ జెందినవాఁడనని చెప్పుకొనినాఁడు. ఈతని కవిత్వము "మొత్తముమీఁద రసవంతమైన" దని కవుల చరిత్రములనుడువుచున్నవి. కాని మొత్తముమీద గాక ప్రతిపద్యమును రసవంతమైనదనియే చెప్పవచ్చును. ఈతఁ డుత్తర రామాయణమును దిరిగి వ్రాసెను. కవిత్రయములో నొక్కఁడగు తిక్కన నిర్వచనోత్తరరామాయణ ముండఁగా మఱి యైదువందలయేండ్ల కీయాధునికుఁడు వ్రాసిన గ్రంథ మెంత యుత్తమమైనదయిన నిలువఁబడునో యోచింపవలసినదే. కళాకుశలతయందుఁ బాపరాజు తిక్కనకుఁ దీసిపోయినను, శైలియందుఁ బాపరాజు రమ్యతఁ జూపెను. కొన్ని భాగములు తిక్కనకంటె రసవంతముగ వ్రాసెననుటవలన నది తిక్కనకు లోపము కాదు. ఏమనఁగా, నీతఁడు తిక్కన వ్రాఁతఁ జదివి యంతకంటె మనోహరముగ నుండవలెననియే వ్రాసెను కదా! ఈ గ్రంథము పువ్వగిరి తిమ్మన్న వ్రాసి పాపరాజు పేరు పెట్టెనని వాడుకకలదది విశ్వాసార్హము కాదు. ఉభయకవులకు శైలీభేద మున్నది.

పాపరాజు ప్రళయకావేరీపట్టణమున "అమీను" పనిలో నుండినయుద్యోగి. ఇతఁడు 18 వ శతాబ్దాంతమున నుండెను. ఇతఁడు విష్ణుమాయావిలాసమను యక్షగాన మొనరించెనఁట! అది యిప్పుడు చిక్కదు. పాపరాజు గ్రంథమునందుఁ దనకుఁ బుప్పగిరి తిమ్మన్న సాయమొనర్చిన ట్లంగీకరించియే యున్నాఁడు. కావున తిమ్మన్న వ్రాసియుండ నవసరము కన్పట్టదు.

✕

**శ్రీనాథుఁడు:—** ఇతఁడు పద్మపురాణమును వ్రాసిన కమలనాభామాత్యుని మనుమఁడు. మారయపుత్రుఁడు. ఇతనితల్లి భీమాంబ. ఇతఁడు క్రీ॥శ॥ 1365 లో జన్మించి 15 వ శతాబ్దము నడుమవఱకు జీవించి యుండె నని చరిత్రకారుల యభిప్రాయము. ఇదియే సత్యమని చెప్పఁ జాలము. మొత్తముమీఁద నాప్రాంతములవాఁడనుట కభ్యంతరము లేదు. ఇతఁడనేక రాజుల నాశ్రయించి, పలువురపైఁ గృతుల నిచ్చి కటకము మొదలు కర్ణాటమువఱకు దేశాటన మొనర్చెను. ఆకాలమునందు శ్రీనాథుఁ డనిన రాజలోకమునకు భయంకరముగ నుండెడిది. మంచినోరు కలవాఁడు. ఇతఁడు వ్రాసిన గ్రంథములు (1) మరుత్రాట్చరిత్రము (2) శాలివాహనసప్తశతి (3) శృంగార నైషధము (4) హరవిలాసము (5) కాశీఖండము (6) భీమఖండము మొదలగునవి. ధనంజయ విజయము, నంద నందన చరిత్రము, పాటలు, పద్దెములు ననేకములు వ్రాసె నందురు. మఱియు పల్నాటివీర చరిత్రము, వీధినాటకము కూడ నీతనివే యందురు. ఇతఁడు మంచి పండితుఁడు. చాలవఱకు భాషాంతరీకరణము లొనర్చినవాఁడు. దీర్ఘ సంస్కృత సమాసముల యథారూపముగఁ దెలుఁగున మంచి కొన్నిచోట్ల వ్రాసి యున్నాఁడు. ఇతఁడు కర్ణాటమున కనకాభిషేక మందియో, గజపతులచే గజలాభము నందియో, మంత్రులకడ హేమపాత్రల భుజించియో, రెడ్లకడ కృతులిచ్చియో, వైశ్యుల కడ కస్తూరి నర్థించియో, మాటలాడిన బద్యము లల్లియో, బంగరు పల్లకులపై రాజభోగము లనుభవించిన మహాభోగి. కొన్ని చాటుపద్యముల వలన నీతఁ డవసానకాలమున దారిద్ర్యము ననుభవించినట్లు తెలియుచున్నది. ఇతని కావ్యముల స్మరణ మాంధ్రవాణికి మంగళప్రద మైనది.

---

# కావ్యసంగ్రహము



## రెండవభాగము.



### ధూర్జటి

### తిన్నఁడు శివునకుఁ దనకన్నుల నర్పించుట.

పొత్తపినాటిలో నొక విపినభూమియందు 'నుడుమూరు' అనుపల్లె విరాజిల్లుచుండు. అందుఁ గిరాతులు నివసించుచుందురు. అప్పురంబునకు నాథనాథుండను నరణ్యభూనాథుం డధీశ్వరుండై యుండు. ఆపులింద భూవిభునకు తండె యను మందగామిని భార్యయై చెలువొందు. ఆశుభ దంపతులకు శివప్రసాదంబున నొకపుత్రుం డుదయించె. ఆనందనుతిన్నం దనంబున కానందము నొంది తలిదండ్రులు వానికి తిన్నఁడని పేరుపెట్టిరి. ఆబాలుండు దినదినప్రవర్ధమానుండై యౌవనం బాసన్నం బగుడుఁ, దన కులోచితధర్మంబు ననుసరించి విలువిద్య మృగయా విహారము మున్నగు విద్యల నభ్యసించె. ఇట్లుండ నొక్కనాఁ డాతండు మృగయావినోదక్రీడారతుండై వలయుపరికరంబులం గూర్చికొని యెఱుకువాండ్రం గూడి వేఁటకై వెడలి యనేక క్రూరసత్త్వంబులం గూల్చి యాయాసంబునం బడలి యొకవకుళతరుచ్ఛాయం జేరి సుఖనిద్రం జెందె. అంత నాతనికి స్వప్నంబునం దొక్క దివ్యపురుషుండు ప్రత్యక్షుండై "బాలకా! యిచ్చటి కనతి దూరంబున నొక శిలాపటమూలంబున మొగలేటిదరని నొక కొండ గలదు. అచ్చట పార్వతీ నాథుండు భక్తులపాలిటి పెన్నిధియై వసించుచుండు. నీ వాతని భక్తితో సేవించి శుభంబులం బడయుము" అని చెప్పి యంతర్ధానంబు నొందె, అంతఁ దిన్నం డదరిపడి మేల్కాంచి తన కలలోఁగాంచిన పురు

షునికై యటునిటు వెదుక నొక్కచో నొకవరాహంబు గట్టెదుటం బొడఁగట్టఁ ధనుఃపాణియై దానివెంట నంటి తఱుమఁ దఱుమ, నది యాతని వేటునకుఁ జిక్కక చెంగుచెంగునం జెంగలించి తద్దయుం దవ్వు త్రిప్పి యొక్కచో నదృశ్యమయ్యె. అంతఁ దిన్నండత్యంతవిస్మయ విహ్వలుండై యది యంతయుఁ బరమశివుని మాయావిలసనంబుగా భావించి నలుదెసలం బరికించి చూడ, నచ్చట నొక కొండదరిలో నొక శివలింగ మాతని దృక్పథంబునం బొడసూపె. అంత నమ్మహాలింగంబునకు సాష్టాంగ వినతు లర్పించి యానంద బాష్పంబు లుశయిల్ల నాతన్నం డిట్లనియె.)

శా. "ఓసామీ! యిటువంటికొండదరిలో నొంటిన్బ్బులుల్ సింగ
ముల్ గాసిం బెట్టెడు కుట్రసట్టడవిలోఁ గల్జువ్విక్రీనీడ నే
యాసం గట్టితి వేటిగడ్డ? నిలు నీ వాఁకొన్నచోఁ గూడునీ
ళ్లేసుట్టంబులు దెచ్చి పెట్టెదరు? నీ కిం దేటికే లింగమా!

క. ఓ లింగమ! విను నివ్వరి
బ్రాలును నోడిపిళ్ళు గుసుకుఁబ్రాలును వెదురున్
బ్రాలును, సవరపు మెకముల
పాలును గల వచట నీకుఁ బాయసమునకున్. 3

తే. పుట్టతేనియ పెరతేనె పుట్టజున్ను
తొఱ్ఱతేనియ గల దంచుఁ దోఁచి తోఁచి
కాలి దులదులనై పిండిపోలె రాలు
నట్టినింజెట్లు గలవు నీ కారగింప. 4

శా. ఇల్లో? ముంగిలియో? యనుంగుఁజెలులో? యాడైన చుట్టం
బులో యిల్లాలో? కొడుకో? తరింపవశమే యేపాడుముల్లేక?

మాపల్లె న్గోరినవెల్లనుం గలవు; తెప్పల్గాఁగ నీకిచ్చెదన్
జెల్లంబో! యిట నొంటినుండకటు విచ్చేయంగ దేలింగమా!

మ. నను మన్నించెద వేని నీవిపుడు రా నావెంట రాకుండినన్
నిను నేఁ బాసి చనంగ నోప నిచట న్నీతోడి దే లోకమై
మనువాఁడం గనుఁవాఁడ నీకరుణ నీమానంబు చిత్తంబువ
చ్చినచో మానుదుగాని నిన్నిపుడుక స్సిక్కఁబెట్టనా కేటికిన్!”

వ. అని ప్రార్థించి మరల ని ట్లని వితర్కించు. 7

క. ఎన్నేండ్లనుండియో వ
స్తున్నాఁ డీ యడవిలోన నొంటి మహేశుం
డిన్నెగులు మాన్పవలదా
కన్నారం గనినబంటు గలఫల ? మనుచున్ 8

ఉ. వి ల్లొకచంక, నంపపొదివీఁపున దొప్పలు కేలుఁదోయిపు
క్కిళ్ళఁ బవిత్రకాంచము ముఖీజల మొప్పఁగవచ్చి భక్తిరా
జిల్లఁ దదంబుమజ్జనము సేయుచు దొప్పల నంజుడద్రిరా
జిల్లుని నారగింపు మన నాపరమేశ్వరుఁడూరకుండినన్. 9

క. “కాలవో క్రొవ్వవో ? మాడన్
గాలెనొ ? చవిగావో ? కమ్మగావో నీకున్ ?
జాలవొ ? యలవడవో ? తిన
వేలా కఱకుట్లు ? పార్వతీశ్వర ! చెపుమా. 10

క. ఆఁకలి గాదో ? భక్తిన్
దేఁకువ గలవాఁడఁ గానొ ? తిన వేల ? కృపన్

సాఁకం గదె నన్నిపుడ
ప్రాఁకలఁ బెట్టక పలాశనాసక్తుఁడవై.

క. నెప మొకటి గలదె నాపై?
నుపవాసముతోడ బడలియుండగ నీకే
యపరాధము సేయం గదె?
కృపతోఁ గఱకుట్టు లారగింపం గదవే! 12

క. నీ వారగింపకుండిన
జీవన మేమిటికి నాకు! శివ! నీపదరా
జీవములమీఁదఁ బ్రాణము
నే విడుతు'' నటంచు వ్రాలి యేడ్వం దొడఁగెన్. 13

వ. అని యిట్లెన్నివిధముల ననునయించినను విలపించినను
శివుండు ప్రసన్నుండు గామికిఁ జింతించి. 14

క. తినకున్న నే మొకో యని
యనుమానముఁ బొంద నభవుఁ డంతటిలోనన్
గనుదమ్మి గ్రమ్మి పొటపొటఁ
జినికె న్గన్నీరు శబరుచిత్తం బరయన్. 15

క. ఒకమరి కొకమరి కించి
ద్వికచారుణపద్మపత్రవీథీవిగళ
న్మకరందధారగతిఁ దన
ముకుళితనేత్రమున భాష్పములు ఘనమైనన్. 16

క. అందులకుఁ దండెనందనుఁ
డాందోళము నొంది కంటి నంటిననొప్పిన్

బందికఱకుట్లు దినఁ డేఁక
సందియ మేమిటికి ? మందు సమకూర్ప నగున్. 17

వ. అని తిన్నం డన్నఁడు లేనిహానిం బూనినవాని తెఱంగున నంత రంగంబునందరంగంబులైన దుఃఖంబునంగరంగుచు.

తే. విన్నమందులు తా సరి కన్నమందు
లడిగి తెచ్చినమందులు నడవిమందు
లెన్ని చేసిన మానక, యిందుమౌళి
కన్ను తొడిఁబడి నెత్తురు గాఱుటయును. 19

తే. "మాటిమాటికిఁ జేసినమందు లెల్లఁ
జెల్లెఁ బో నెల్లిఁ గలిపినచింతపండు
నీట వ్రాసినవ్రాలు నై నెరయ వఱదఁ
బోవుఁ గా కేమి ? నెత్తురు పుట్టనేల ?

ఆ. వేఁకి వెచ్చ మైన వెచ్చని మందులఁ
గాదె మాను నట్లు గంటి కింకఁ
గంటికంటె మందు గలదె ముక్కంటికిఁ
గంటి" యనుచు బోయఁ గదియఁ బోయి. 21

ఉ. ప్రాణము వోవునో, తనువుభంగమునొందునో నాక, తూణికా
బాణము జిఱ్ఱునం దిగిచి భల్లముఖాగ్రము రక్తపద్మ దృ
క్కోణముఁ జేర్చి గ్రుచ్చియొక గ్రుడ్డువడిం బెకలించిశోణిత
ద్రోణిక మైనదైవతశిరోమణికంట నమర్చెనంతటన్. 22

ఉ. మున్నిటికంటికంటెఁ గడుమోహనమై తనకన్నువచ్చినన్
మన్ననఁజూచి మెచ్చక యుమాపతి రెండవకంట శోణిత

క్లిన్నతఁ జూపినన్నగి పుళిందుఁడు "నీకృపచేతఁ గన్నమం
యున్నది దీనికి న్వేఱవ నొక్కటి నావ్రత మింక శంకరా!

క. లాలాటలోచనంబునఁ
గీలాలము దొరఁగెనేని కేవలభక్తిన్
గీలించి మనోదృష్టికి
మూలం బగు నాదుప్రాణములు నీ కిత్తున్." 24

క. అని చెప్పి కాల నిటలా
క్షుని కన్గొనఁ దన్నిపట్టి సునిశితబాణం
బునఁ దన రెండవ కనుఁగ్రు
డ్డునుఁ బెకలింపంగఁ బూనుడును సదయుండై. 25

ఆ. కన్నుఁ దివియఁ బూను కన్నప్పతీవ్రత
కన్న మున్న గాఁగ ఖండపరశు
వాశుగంబుఁ జెయ్యి నంటంగఁబట్టుక
నిలువు నిలువు మనెడు నెలుఁగుతోడ. 26

చ. హరి యరవిందసూతి మును లష్టదిశాపతు లాదిగా వియ
చ్చరు లిరువంకల న్గొలువ సత్వరత న్నిజలింగనిర్మలాం
తరముననుండి శీతవసుధాధరకన్యక ముద్దుకేలుదా
మరకడవ్రేలు పట్టుకొని మన్ననఁదిన్ననికి బ్రసన్నుఁడై.

వ. వదనారవిందంబున మందహాసంబు దుఱంగలింపఁ దన
కురంగటకుం దిన్నని రావించి 'నీకింపగు వరంబు వేఁడు
మిచ్చెద' నన

చ. "జగములునంతరాత్మయును సాక్షియు నీవనుచున్నిజంబుగా
నిగమము లాడఁగా వినియు నేఁ డితరంబుగ నాకభీప్సితం
బగువర మొల్లఁ వేఁడఁ గలనయ్యా? భవన్మయమైన పూర్ణచి
ద్గగనములోన నుంగలిపి క్రమ్మరఁ బుట్టెడు బాధ మాన్పవే!

క. మీతలఁపుకన్న నధికమె
నాతలఁ పిట్లడుగ నేల? నను మీ చిత్తం
బే తెఱఁగున వెలుఁగొందెడు
నా తెఱఁగున నుండఁ జేయునది గాక శివా! 30

క. ఆనందామృతవారి ని
ధానంబున మనము మగ్నతం బొందె, వరం
బీ నమరినఁ దాదాత్మ్యం
బోనిరుపాధికదయాసముజ్జ్వల! యీవే! 31

# నారాయణకవి.



## మిత్రద్రోహము.

సీ. రంగదుత్తుంగతరంగసంఘంబులు
సరసాభినయకరాబ్జములు గాఁగ
బహువిధప్రచలితపాఠీనపంక్తులు
ధవళవిలోలనేత్రములు గాఁగ
సురచిరస్నిగ్ధపాండుర ఫేనపటలంబు
చారుత రాట్టహాసంబు గాఁగ
లాలితభూరిబాలప్రవాళంబును
విరిసిన ఘనజటాభరము గాఁగ

ఆ. ఘుమఘుమధ్వని వాద్యఘోషములు గాఁగఁ
జండతాండవాడంబరశంభుమూర్తిఁ
బోలు నని తన్ను జనములు పొగడునట్టి
వర్ణనకు నెక్కి యొప్పు మహార్ణవంబు. 1

ఉ. ఆలవణాంబురాశిదరి నర్జున తాలతమాలసాలహిం
తాలరసాలభూరుహవితానము సొంపు వహింప నచ్చటన్
వేలతరంబు లైన కపివీరులతో బలివర్ధనాముఁ డి
చ్ఛాలఘువర్తనంబుల నజస్రముఁ గ్రుమ్మరుచుండు నత్తఱిన్

వ. మఱియును దత్సమీపంబున నొండొక యూథనాథుం
డైన కపీశ్వరుండు బలివర్ధను నుద్దేశించి. 3

ఉ. ఈముదిమర్కటంబునకు నేటికి నీకపిరాజ్య మంచు ను
ద్దామబలప్రతాపబలదర్పమునన్ వెడలంగఁ దోలినన్
సీమకుఁ బాసియొక్కరుఁడు సిగ్గెసఁగన్ బలివర్థుఁ డేగెనా
రామవిహారముల్ విడిచిరాజసవృత్తిఁ దొఱంగియయ్యెడన్.

వ. చని చని యొక్కనదీతీరంబున మధుగర్భం బను నామం
బరంబు ఫలభరితంబైన దాని నాలోకించి బలివర్థనుండు
దనమనంబున. 5

క. కామితఫలముల నొసఁగం
గా ముందట గల్పకంబు గానంబడిన
ట్లా మేడి కను ఫలించెను
నా ముందటిభాగ్యవాసనకు దృష్టముగాన్. 6

వ. అని తలంచి డాయం బోయి. 7

క. తరు వెక్కి దీర్ఘశాఖలఁ
బరిపక్వఫలంబు లరసి భక్షించు తఱిన్
గరమునకుఁ దప్పి యొక ఫల
మరుదుగఁ బడె నీటిలో మహాధ్వనితోడన్. 8

క. ఆచప్పుడు తన చెవులకు
నేచినకౌతుకముఁ బెనుప నెడనెడ ఫలముల్
వైచుచును సహజచాపల
మై చనుమర్కటము చప్పు డాలించుతఱిన్. 9

వ. క్రకచనామధేయంబగు శింశుమారంబమ్మేడిక్రిందిజలంబుల
లోనఁ గ్రుమ్మరుచుండి మత్సమీపంబున నెన్నండునట్టి

యపూర్వధ్వనివిన్నదిలేదనితలయెత్తిచూచినప్పుడౌదుంబర
తరుశాఖాసమారూఢ శాఖామృగకరవిముక్త ఫలపతనం
బమ్మహాగ్రాహంబు దెలిసి తానునమ్మధురఫలంబు లుప
యోగించి యావృద్ధ వానరంబుతోడఁ జెలిమిచేసి తన్మి
త్రత్వానందంబున నమ్మధుర ఫలాస్వాదనలాభంబున న
చ్చోటు గదలంజాలక కొన్నిదినంబులు మఱచియున్న
మొసలిం దలంచుకొని యమ్మొసలి భార్య దనసఖిం
బిలిచి దానితో నిట్లనియె. 10

ఉ. "ఇంతకుమున్ను నాదుహృదయేశ్వరుఁడెయ్యెడకైన నేగినన్
సంతసమొప్పవచ్చునిమిషంబున నిన్ని దినంబులయ్యెఁ దాఁ
డెంతలఁ జేరఁ డేమిటికిఁ జిక్కెనొ? కాక పరాంగనారతి
భ్రాంతి నిజాలయంబునకురాక చటంబ్రియమొంది నిల్చెనో?

క. తెలియంగవలయుఁ బొ"మ్మని
పలికిన నది పోయి వచ్చి ప్రాణసఖికి నే
ర్పలవడఁగఁ జెప్పఁ దొడఁగెన్
గలవియు లేనివియుఁ గూర్చి కలఁకం బొందన్. 12

సీ. "నెలఁత! నీవిభుఁ జూడ నీవు నన్నంపినఁ
జయ్యన నేను బ్రచ్ఛన్నవృత్తిఁ
గదిసి చూచితి; నొక్కకపిభామ రూపలా
వణ్యవిలాసభావములఁ బెద్ద
మధుగర్భ మనునుదుంబరముపై నుండఁగఁ
బొడఁగని దానితోఁ బొందు చేసి

యాపాదుమక్కువ నంతకంతకుఁ బెంప
నీయింటి తెరువుపై నిన్ను మఱచెఁ

తే. బేర్చుమతిఁ: బూరుషులు నవప్రియులు గాన
వారి మానసంగ నేరికి వశము గాదు
చెలియ ! నీమీఁది భక్తిమైఁ జెప్పవలసెఁ
గాక వివరింప నా కేమి కారణంబు ?" 13

క. అమ్మాట మొసలిలేమకు
నమ్మయి తాఁకుటయు నిశ్చయం బని మదిలోఁ
గ్రమ్మెడు విరహానలమున
సమ్మోహనమూర్ఛ పరవశత్వముఁ జేయున్. 14

వ. అమ్మకరవధూటి ప్రియసఖీ సంభాషణంబులఁ బెద్దయుం
బ్రొద్దునకుఁ దెలివి నొంది. 15

ఆ. మగఁడు చేసినట్టి నెగులునఁ గడు నొచ్చి
విరహవహ్ని చేత వేఁగి వేఁగి
పొరలుచుండునంతఁ బొలఁతిపై మక్కువఁ
గొన్ని మేడిపండ్లు గొనుచు వచ్చి. 16

వ. ఆక్రకచుం డట్లున్న తనప్రాణవల్లభంజూచి యిట్లనియె 17

ఉ. "పంకజనేత్ర! నీయొడలిభారముచూచి భయంబుపుట్టెడున్
గింకకుఁ గారణంబు పరికించి యొకించుక నాకుఁ జెప్పినన్
గొంకకతీర్తు" నన్నవిని కోమలినెచ్చెలి మోము చూచినన్
శంక యొకింత లే కది నిజంబుగఁ బుట్టెడునట్టి భంగిగాన్.

వ. అశింశుమారంబున కిట్లనియె. 19

ఉ. "అక్కట! నీవు పోయినది యాటికి నీకలకంఠి దుర్గమం
జక్కినఁ జానకుండెఁగా ప్రసిద్ధుఁడు సిద్ధుఁడు వచ్చి యౌషధం
బొక్కటి చెప్పి పోయె నది యుక్తము నీకెఱిఁగించువారమై
యిక్కమలాయతాక్షి యను నేనును నీపొడఁగాన మెన్నఁడున్"

వ. అనిన సమ్మోహగ్రాహంబు. 21

క. "సంజీవని మొదలుగ నే
సంజక గానివత్తు నెట్టి యౌషధ మైనన్
రంజకపుమాట గా దిది
కంజాతదళాయతాక్షి! గ్రక్కునఁ జెపుమా!" 22

క. "వానరహృదయముతోఁ దగ
నూనినయౌషధము వెట్టనుపదకు మానన్
మేనఁ గలరోగ మనుచును
దా నెంతయుఁ గరుణఁ జెప్పి తాపసుఁ డరిగెన్. 23

ఆ. కానఁ గోఁతిగుండెకాయ నీ విప్పుడు
తెచ్చి యిచ్చితేని తెఱవ బ్రతుకు
లేకయుండెనేని నీకుల భామిని
తనువు విడుచు గడియతడవులోన." 25

వ. అనినఁ దద్వచనంబు లాకర్ణించి యతం డట్టిదకాకయును
చుఁ గొంతద వ్వరిగియరిగి తనమనంబున నిట్లని వితర్కించె.

క. "తరుచరహృదయము నాకుం
దరమే దొరకింపఁ? గష్టదశ వచ్చెఁ; గపీ

ట్లరిగిన వచ్చిటినాయి
లైరవై మదిఁ దోఁచె నిలువ నెట్లగుఁ జెప్పుమా. 32

క. ఉపకారవాంఛ సఖ్యము
నిపుణతఁ జేయుదురుగాక నీ వేమియుఁ బ్ర
త్యుపకార మపేక్షింపని
సుపురుషుఁడవు కావె యెపుడు సుస్థిరచరితా!"

వ. అనుటయు బలివర్థుం డిట్లనియె.

తే. "దాని యుపకార మే నేమి చేసినాఁడఁ?
బూని నీతోడఁ జేసిన పొందువలన
రాజ్యవిరహితదుఃఖభారంబుఁ ద్రోచి
తాల్మినున్నాఁడ నదియు యుక్తంబు గాదె? 35

తే. శోకశాత్రవభయముల చొప్పు మాన్పు
ప్రీతి విశ్వాసగుణహేతుభూతమైన
'మిత్ర' మనునక్షరద్వయమిశ్రమైన
రత్న మే వేల్పు సృజియింపఁ బ్రబలెనొక్కొ? 36

వ. అని పలికిన విని క్రకచుం డిట్లనియె.

ఉ. "మింటికి నిక్కు నీతరువుమీఁదను నీవును నేను నీటిలో
నొంటిఁ జరింపనోపుటకు నోర్తునె? వీపున మోచి నిన్ను మా
యింటికిఁ గొంచుఁబోయెదఁ గపీశ్వర! ర"మ్మన నాతఁ డంబని
ష్కంటకబుద్ధిఁ బెల్లుఱికి క్రక్కునఁ జెంతకువచ్చి నిల్చినన్.

క. నిలిచిన కపివరుఁ దోడ్కొని
నిలుపోపక మొసలి పలికె "నేఁ డీ మిత్రున్

జలముఁగొని చంపవలసెను;
కలఁడే నావంటిపాపకర్ముఁడు జగతిన్ ? 39

క. స్త్రీకార్యము బలవంతము;
నా కింతటిసాధుమిత్రు నగచరు మృతుఁగాఁ
జేసెఁ బఱఁగఁ జేయుకతమున
లోకంబున నింద కేను లోనైతిఁ గదా ! 40

వ. అని విచారించి మఱియును దనమనంబున. 41

"సీ. హేమంబు మేలుగీ డెఱుఁగంగ దలఁచిన
మానుగా నొరసినఁ గానవచ్చుఁ
బురుషులగుణముల పరికించి చూచిన
నెందైన నడవడి నెఱుఁగవచ్చు
లలితగోవృషములఁ దెలియ భావించిన
భారముల్ గాంచి యోర్పుఱుపవచ్చు
స్త్రీస్వభావంబులు దెలియుదు నన్నచో
నెంతధీయుతులకు నెఱుఁగ రాదు

తే. మాయలకు నిక్క మందులమనికిపట్టు
సకలదోషంబులకు నెల్ల జన్మభూమి
మగువ; గావున నిపుడు న న్నగడుచేసి
యేమి వన్నెనొ నాసతి యెఱుఁగ రాదు." 42

వ. అని తలపోసి వెండియుఁ దనమనంబున. 43

ఆ. "ఆడుదానికొఱకు నకట ! నాప్రియమిత్రు
వృద్ధుఁ జంప నెట్లు బుద్ధి పుట్టె? "

ననుచు వినఁగ నాడునమ్మాట లాలించి
వానరుండు పలికె వానితోడ. 44

క. "ఏమంటి విప్పుడు నీలో?
నేమిటి కీచింత? నాకు నెఱిఁగింపు' మనం
గా మొసలియు నిట్లను "నే
నేమియు ననఁ దప్ప వింటివే నే మంటిన్" 45

క. అనుమాట కాత్మలోపల
ననుమానము నొంది వానరాధిపుఁ డీతం
డనుమానించుచు నగుచుచు
ననుఁ గొనిపోవుటకుఁ గారణం బెయ్యదియో? 46

తే. అడిగి చూచెదఁ గాకంచు నగచరుండు
కలఁక నొందినమదితోడఁ "జలచరేంద్ర!
నాకు దోఁబుట్టు వైననీనాతి కిప్పుడు
సేమమే?" యన్న నామాట చెవులు సోఁక. 47

ఉ. అల్లన శింశుమారవిభుఁ డాకపినాథునిఁ బల్కె "మన్మనో
వల్లభ రోగపడ్డయది వైద్యు లసాధ్యమనంగ దాని కే
నల్లమునం దలంకెదఁ బ్రయోగము చెప్పినఁ దీర్చువాఁడు లే
కల్లెడ నీటిలోనిపని యింతియ నాపని మిత్రవత్సలా!"

వ. అనుటయు, నాబలివర్ధనుం డిట్లనియె. 49

చ. "జలములఁ గాని వెల్పలికిఁ జాలనటంచు విచార మేటికిన్?
బలికిన మందు దెత్తునని బంపు, మ తెన్నటి కేను బోయిభూ

వాయసము నెల్లఁ గ్రుమ్మరి దివాకరుఁ డయ్యపరాంబురాశిలోఁ
పల దిగిపోకమున్న వడిఁ బొంతెరయుంబున వత్తుఁ గొమ్మ నేఁ.

క. పొ మ్మనవు పోయి మందులు
దె మ్మనవు చికిత్స చాలఁ దెలిసిన వైద్యుఁ
ర మ్మనవు భార్య నిజముగ
సొ మ్మనవు దలఁక నేమి చోద్యము చెపుమా!" 51

వ. అనిన నమ్మకరకులాధీశ్వరుం డిట్లనియె. 52

ఉ. "అడిగినవాఁడఁ బండితుఁడ నాయన చెప్పఁగ ముందు నీకడం
దడవఁగఁ జాలకేను బరితాపముఁ బొందుచు మున్నవాఁడ ని
ప్పుడు నెఱింగింపకున్న నది పోవదు నామదిలోని దుఃఖమున్
గడవఁగ నీవ కాదె నా యకారణబాంధవ! మున్నిభంగులన్."

వ. అనినఁ దకచరనాథుం డిట్లనియె 54

తే. "మనసు గలిసినచో నొకమాట యైనఁ
గపటమునఁ జెప్పకుండుట కలుష మండ్రు
ప్రాణసఖుఁ డగువాఁడు దాఁపంగ నగునె?
చెప్పఁ దగనిది యైనను జెప్పు" మనిన. 55

వ. అమ్మాటకుఁ బుయిలోటదక్కి మొసలి యిట్లనియె 56

క. 'వానర హృదయముతోఁ గా
నూనిన యౌషధము దెచ్చి యుడికుఁ బెట్టన్
మేనఁ గలరోగ మంతయు
మాను' ననుచు నొక్క వెజ్జు మగువకుఁ జెప్పెన్. 57

ఉ. చెప్పిన నన్నుఁ దెమ్మనియెఁ జెప్పెడి దేమి! మఱెందు నేరికిం
జెప్పక నీకునుం దెలియఁ జెప్పఁగఁ జాలక యాత్మ నాకు నేఁ
జెప్పఁగ నీవు నన్నడుగఁ జెప్పితిఁగాని భయంబు పుట్టఁగాఁ
జెప్పుట గాదు కార్యగతి చెప్పితి వానరయూథనాయకా !

క. తనసతికి రోగమైనం
గనుఁగొని యది చక్కఁబెట్టఁగా నేరఁ డితం
డని నన్ను బంధుజనములు
మునుపీసుఁగుఁ గాఁ దలంప మఱి యేమిటికిఁ ? 59

వ. అని చెప్పినఁ గపీశ్వరుండు. 60

తే. సగము చచ్చినమేలికోఁ జకితుఁ డగుచుఁ
గంప మొందుచు వృద్ధమర్కటుఁడు మూర్ఛ
మునిఁగి కన్నులు గానక మునిఁగి కొంత
వడికిఁ దెప్పిఱి యాత్మదైవంబు దూఱి. 61

వ. తనలో నిట్లని వితర్కించె. 62

తే. ప్రేమ నటియించి యింటికిఁ బిలువఁ దడవ
మొసలిమాటకు నాకేల మోస గలిగె ?
నెంత ముదిసిన నేను జితేంద్రియుండఁ
గామి నాపదఁ బడితి యుక్తంబు కాదె ? 63

సీ. రాగసంయుక్తుఁ డరణ్యవాసంబున
బహుకాల మున్నను ఫలము లేదు ;
నెఱయఁ బంచేంద్రియ నిగ్రహంబున నిల్లు
గదలకున్నను వాని కదియ ఫలము ;

వీతరాగుండును వినయశీలుండును
వివిధధర్మాధర్మవిదుండు నగుచు
సత్యనయదానశౌచంబు లెవ్వఁడుఁ
గలిగి వర్తించు నిష్కపటవృత్తి
తే. వానివిలయంబు ఘనతపోవనము గాని
దండకాషాయవస్త్రకమండలువులు
ముండితాలయము భిక్షాటనముం జదువును
నాటకమ్ములిపి ప్రయోజనములు గావు." 64

వ. అని తలంచి బలివర్ధనుండు దైవానుకూల్యంబున నాయ
శ్వేషంబుకతంబునందనకు నప్పటికొక్కయుపాయంబు
తోఁచిన నాశింశుమారంబునకు నిట్లనియె. 65

క. "ఓయన్న ! కల్ల చేసితి
నీయర్థము మున్న నాకు నెఱిఁగించిన నే
నాయంతరమునఁ గలిగిన
యాయౌషధ మప్పుడ కొంచు నరుదెంతుఁగదే! 66

ఉ. గుండియ పచ్చిపెట్టుకొని కొమ్మపయిం బదిలంబుచేసినే
నుండుదు నట్టిభారమున కోర్వక యెప్పుడు; నేఁడు నే నభా
గ్యుండను నీకు నక్కఱకుఁ గూర్చ్చనపొమ్మని మున్నెఱింగి తే
కుండుట జేసియేమనిప్రియోక్తులు వల్కుదు! నేమి సేయుదున్

వ. అయినను, త్వరితగమనంబున నయ్యుదుంబరంబు కడకుం
జని, యస్మదీయహృదయంబును గొని చనుదెంతి" మని
పలికి వెండియు. 68

తే. మొనసి ధర్మార్థకామముల్ మూఁటివలన
ఫలము లెవ్వఁడు దా నొనపడియె నేని
వాఁడు రిక్తహస్తములఁ బోవంగఁ దగదు
భూమిసురరాజకాంతలపొంత కెందు. 69

క. మానుగ హృదయము వచ్చటి
ద్రుమనం దగిలించి యుంటి మన నట మఱఁదం
గా నరిగి వేగ నది గొని
మానిని యున్నెడకు నిపుడ మరలఁగ వలయున్." 70

క. అమ్మాటల జలచరమును
సమ్మతితో నమ్మి వృక్షచరమును గొనుచుం
గ్రమ్మఱ మును నున్న తరువు
కొమ్మం గదియింపఁ గపియుఁ గుప్పించి పడెన్. 71

తే. అంతకంతకుఁ బొడవుగా నరిగి యచటి
వృక్షశాఖాగ్రమున నున్న వృక్షచరముఁ
గాంచి "చెలికాఁడ ! రమ్మ వేగంబ మనకుఁ
బోవవలె" నన్న జలచరంబునకు ననియె. 72

ఆ. "ప్రాణసముఁడ వంచు భావించి నీతోడఁ
జెలిమిఁ జేసి ప్రాణములకుఁ దెచ్చి
కొంటి నింక నిదుకూరమి చాలును
శీఘ్రముగను జనుము శింశుమార !"

# శంకరకవి.

## చంద్రమతీ ధీరత్వము.

(హరిశ్చంద్రుని నెట్టులైన బొంకింతు నని విశ్వామిత్రుండు వసిష్ఠునితోఁ బ్రతిన వట్టి, యొక్కనాఁడు హరిశ్చంద్రునికడ కేఁగి తనయాగమునకై కొంతధన మిమ్మని వేఁడి, యాతం డొసంగఁబోవ, 'నిది నీయొద్దనే దాఁచి యుంచుము. వలసినప్పుడు వచ్చి కొనియెదఁ గాక' యని చెప్పి వెడలి చనియె. అంతం గొంతకాలంబునకు విశ్వామిత్రుం డొక కపటము పన్ని హరిశ్చంద్రుని వంచించి యాతని రాజ్యం బంతయు హరించి, యజ్ఞార్థమై తాను మున్నాతని కడ దాఁచియుంచిన విత్తము నిమ్మని తఱచి యడుగ, హరిశ్చంద్రుం డమ్ముని చేసిన మోసమ్మును గ్రహించి చేయునది లేక కొంతకాలము గడువిచ్చినచో ఋణంబు తప్పక తీర్తునని చెప్పి యొప్పించి, భార్యాపుత్రసహితుండై కాననంబులకు వెడలె. అంత విశ్వామిత్రుండు తనఛాత్రుండగు నక్షత్రకు నమ్మహారాజున కొప్పగించి యాధనము నాతని కిమ్మని నియోగించి చనియె. తదనంతర మానవవరుండు దారుణారణ్యంబులం గ్రుమ్మరుచుఁ బెక్కిడుములం గుడిచి కతిపయదినంబులకు వారాణసీపురంబు బ్రవేశించె. అంత గడవుదినము సమీపింప, నక్షత్రకుం డక్ష్మాధవునితో నిట్లనియె.)

చ. "ధరణిప! నేఁడు నెల్లి యనుచుం దక్కువగా నెలనాళ్ళునయ్యె నే
నరసితి లెక్కఁబెట్టి మితి యాయము లేదొకవీసమైన నే
వెరవున నింక మాఋణము వేగమె తీర్చెదొ? కాక మిన్నకే
సురిఁగెదవో వివేకగుణశూన్యతఁ బొంది యసత్యవాదివై?

క. భూదయిత! వినవె 'యాల
స్యా దమృతం విష' మటంచు నార్యజనంబుల్

మేదిని నెల్లెడఁ జెప్పఁ బ్ర
మాదము మిఱు గడచెనని మానీంద్రునిచేఁ. 2

తే. మనుజనాథ! వృథాప్రయోజనమునందుఁ
దెలియనేరక యూరక దినదినంబుఁ
బొద్దుఁబుచ్చుచు మానుష్యబుద్ధి యెల్ల
మఱచియున్నాఁడ విది భావ్యమా తలంప? 3

చ. ఇఁక మొకమోటమాత్మ నొకయించుకనిల్పక క్రూరవృత్తిఁగా
శికముని మీఁద నాన యిడి చెచ్చెర నంగడి నడ్డపెట్టి పా
యక బహుబాధలం బొదలునట్లుగఁజేసి కసాధనంబు రా
దకట! నృపాల! యిట్లు తగవా? నను నష్టునిఁ జేయ నేటికిన్? 4

ఉ. ఎంతయు దోషమయ్యె ముని యెప్పుడు వచ్చునొ? వచ్చినప్పుడేఁ
గాంతయు నాఁప తేయమి దెకొవ్వని యియ్యక యున్న రోషితా
న్వాంతుఁడగున్ మునీశ్వరుఁడు నంశయ మింతకు మైన గల్గదా
కంతువిరోధికిం దరముగా దణఁపంగఁ బదీయకోపముల్. 5

క. వీత జపహోమ నియముఁడ
నై తిరిగియు నిన్నుఁ గూడి యరకా నయినం
జేటికి వచ్చినయది లే
దీ తునకుం గినుక వాడమ కెట్లుండు మదిన్? 6

క. 'ఇదె యిచ్చెద నదె యిచ్చెదఁ
బడకద' యని యాసఁ జూపి పలుతెఱఁగుల నా
హృదయము నొప్పించితి వికఁ
గుది త్రోసెద నేఁడు నిన్నుఁ గొంకక యిచటన్. 7

తే. అదనుపదనునె కూర్చి మాయప్పు దీర్చి
పొమ్ము నీ వన్నఁ బోమె యీపోరు మాని ?
బడలి జీతము పెట్టనిబంట నగుచు
వెఱచి నా కేల నీ వెనువెంటఁ దిరుగ ? 8

చ. నినుఁ గినియంగఁ జాల కవనీధవ ? గాధితనూజుమానసం
బున కెడనై లఘుత్వమును బొందఁగ నేటికి నాకు? నీవనె
మ్మనమునఁబుద్ధియందియొకమార్గముఁ జేసెదవంచునుంటిమొ
న్ననఁదొలఁగించినీదొరతనంబునుపండడవాతలంపగన్ ? ”

వ. అని యిత్తెఱంగున నక్షత్రకుండు పలుకునిష్ఠురాలాపంబులు బాణంబులుం బోలె మనోఘాతంబు సేయుటయు, నారాజన్యచూడారత్నంబు ప్రీడాదైన్యంబులు ముఖారవిందంబున నందడింప నమందవ్యాకులత్వంబుం బొంది, పుత్రుండును గళత్రంబునుం దక్కఁ దక్కినవిత్తం బణుమాత్రంబునుం గల్గమికిఁ జింతాఘనస్వాంతుండై, చంద్రమతిం గనుంగొని యేమియుం బలుక నేరక యూరక బెట్టునిట్టూర్పులు నిగుడ్చుచు నానతశిరస్కుండై యుండుటయు, నవ్విధంబు నిరీక్షించి యాపురంధ్రీశిరోమణి యింగితాకారభావజ్ఞయు విశేషగుణధుర్యయు సవినయవివేకగాంభీర్యభాషాచాతుర్యయునై జీవితేశ్వరుం గనుంగొని, 10

ఉ. “నిండినవేడ్క లోకములు నిత్యము సన్నుతిచేయ ధారుణీ
మండల మెల్ల నేలినసమగ్రయశోవిభవుండ వీవు; మా

ర్తాండకులేశ! మాధునివిధంబునభ్రాంతివహించి చింతమై
నుండుట పాటిగాదు ధృతి యుల్లమునన్నిలసిల్లఁజేయుమీ.

ఉ. మిక్కిలిదీనతం బొరయ మీకిది యేటికి? నేఁడు నెల్లియుం
దిక్కువచూచినన్ మితిదినంబు మహీరమణాగ్రగణ్య! యీ
యక్కఱ కేయుపాయమున నైనను విత్తముఁ గూర్చి కీర్తిసొం
పెక్కఁగ మౌనివర్యుఋణమిప్పుడ తీర్చుట మంచిదారయన్

తే. మోసమగు నప్పు దీర్పక యున్న యొక్క-
గడియ యెడనైన మితి సరి గడచెనేని
క్షితితలేశ్వర? నిన్ను బొంకింపఁ బూని
కంకణము గట్టుకొన్నాఁడు గాధిపట్టి. 13

చ. పలుమఱుమిమ్మునివ్వటువుపాయకయుగ్రతఁబల్కునిష్ఠురో
క్తులకునొకింతయైనమదిదుఃఖముఁబొందకుఁడీతఁడెన్నిభం
గులఁ గడుమానసీయుఁడు తగున్మన కీశయాజ్ఞ సేయనో
జలజసఖాన్వయాభరణ! సత్యవచోవిభవప్రతిష్ఠకై. 14

ఆ. పార్థివేశ! యడఁచి పాలు ద్రావించిన
చందమీముసీఁద్రనందనుండు
కినిసి ఋణము దీర్పుమని మిమ్ము మాటికిఁ
బరుష భాషణములు పలుకుటెల్ల. 15

శా. కూపంబుల్ తగుతోఁటలుం జెఱువులుంగుళ్లున్ ధరన్నిల్పగా
నేపుణ్యంబొనఁగూడు మర్త్యులకు ధాత్రీశాన్వయగ్రామణీ!
యాపుణ్యంబురయంబ ప్రాప్తముగు నిత్యస్ఫూర్తిమై సత్యభా
షాపారీణులకున్ వివేకముమదిన్ సంధిల్లనూహించినన్. 16.

తే. అర్థమున కిప్పు డొం డుపాయంబు లేదు ;
వినుము ధీరతతో నను విక్రయించి
తీర్పు సగ మైన నేఁడు గాధేయుఋణము
కడను నొక్కయుపాయంబు గలుగు నెల్లి." 17

చ. అనవుడు నంతరంగమున నమ్ములు నాటినకంటె దుఃఖము
బ్బిన వెగడొంది భూవిభుఁడు ప్రేయసిఁ జంద్రమతీసతీమణిం
గనుఁగొని పల్కె నశ్రువులు కన్నులఁ గ్రమ్మఁగఁ "బద్మగంధి! యి
ట్లనుచితగోష్ఠభాషణము లక్కట! పల్కఁగ నీకుఁ బాడియే?

క. మరితంబు గట్టుకొంటివి
హారహార ! వినరాని యట్టి యతిపరుషవచ
స్ఫురదగ్ని శిఖలు నాక
ర్ణరంధ్రవివరములఁ జొనిపి నలినదళాక్షీ ! 19

చ. ఇలఁ బరికించినం బతుల కెట్టిప్రయాసముఁ బొందినైనఁ గాం
తలఁ దగుభంగిఁ బ్రోచుటయె ధర్మము; లేమల విక్రయించి యో
జలరుహనేత్ర! భర్తలకుఁ జన్నె సుఖస్థితిఁ జెందియుండఁగా?
నలికులవేణు లింతులకు నందులకుం బరభోగహేతువుల్. 20

క. కులశీలరూపగుణములు
గలిగిన సతి భార్య యగుచుఁ గనుసన్నల ని
చ్చలు మెలఁగ నుండుపురుషుని
చెలువము చెలువమ్మ గంధసింధురగమనా ! 21

క. సతి నమ్మి బ్రతుకఁ బూనెడు
పతికంటెను దోసకారి పరికింపఁగ నీ

క్షితిలోన లేఁడు" నావుడు
ధృతి మెఱయఁగ నపుడు సాధ్వి నృపునకు ననియెన్. 22

ఉ. "అంచితసత్యవాగ్విభవ! యాపదఁ జెందిన విత్తమెల్ల వ
ర్జించి కులాంగనం గరుణఁ జేకొనఁగాఁదగు; భార్యనైన ని
ర్వంచన విక్రయించి యనివార్యవివేకకళాధురీణ తా
ధ్యంచితవృత్తిభర్తకునుపద్రవముం బెడఁబాయఁగాఁదగున్.

క. భూవర! వివరింపఁగ భా
ర్యావిక్రయ పాతకంబు నైనను బాయం
గావచ్చుఁ గాని మఱి మి
థ్యావాగ్దోషంబుఁ బాయఁ దర మెవ్వరికిన్? 24

తే. అనృతభాషణుకంటె దోషాధికుండు
సత్యవాచాన్వితునికంటె నిత్యసుకృతి
వెదకి చూచినఁ బొడమఁ డుర్వీతలేశ!
పవనభుఙ్మానవామర భువనములను. 25

క. దారసుతాదుల మోహము
గోరెడు వారలకుఁ దగదు కూడఁగ నని వి
స్తారమతి సూరిజనములు
ధీరతఁ దన్మోహలతలఁ ద్రెంపుదు రనఘా! 26

మ. ప్రతికూలోక్తులు పల్కఁగావలదు భూపాలాగ్రణీ! యుత్తటిన్
ధృతిఁ జిత్తంబున నిల్పి దిగ్భరితకీర్తిస్ఫూర్తితోఁ గూడి సూ
నృతవాక్సంపదఁ బొందు భూజనులు వర్ణింపంగ; నామీఁది మో
హతమఃపుంజముఁ బాపు చిన్మయవివేకాదిత్యబింబంబు చేన్."

వ. అనిదండప్రణామంబులాచరించి కరకమలంబులు మొగుడ్చు
టయు, నగ్గంధగజగామినిం గనుంగొని వసుంధరావల్లభుం
డుల్లంబున నొక్కింతధైర్యం బవలంబించి యిట్లనియె. 28

తే. "ప్రసవకోమలి! వినునాఁడు భయద మగుచుఁ
బేర్చుకార్చిచ్చు చొరఁగ బంపినవిశేష
దోషకారికిఁ గఠినచిత్తునకు నాకు
నిప్పు డీ తెంపు సేయుట యెంత పెద్ద? 29

తే. సకలరాజన్యకన్యకాజనము లపుడు
నీకుఁ బరిచర్య చేయుచు నెమ్మిఁ గొలుతు
రుత్పలేక్షణ! యిపుడు నిన్నొక్కరునికి
దాసిఁగా విక్రయింపఁగ జేసె నజుఁడు. 30

తే. తరుణి! నామాట కడుగెఁడు దాఁట వెఱతు
పతివ! నామానసమునఁ బాయక వసింతు
వింతి! నాకన్న పెన్నిధి వెన్న చూడ
లలన! నాపూజ్యసామ్రాజ్యలక్ష్మి వీవు. 31

సీ. మందిరారామసీమంబులై విలసిల్లు
భయదాటవులు పద్మపత్రనయన!
కనకహర్మ్యంబులై కనుపట్టు సానుమ
ద్గహ్వరాంతరములు సింహమధ్య!
పట్టెమంచములమీఁది పఱపులై శోభిల్లుఁ
బూరిపానుపులు కహ్లారగంధి!

శాల్యోదనంబులై చవులు పుట్టఁగఁజేయు
శాకపాకాదులు సదమలాంగి!

తే. గరిమ నిన్నుఁ గూడి చరియించుకతన నాకు
నిందుబింబాస్య! యిన్నాళ్ళ కిపుడు నేఁడు
పొగడఁ దగునాడు రాజ్యవిభూతి వెల్ల
నెరియ నెడఁబాసిపోవుట యెఱుకపడియె. 32

క. ఏణాక్షి! నిన్నుఁ బాసినఁ
బ్రాణంబులఁ బాసినట్లు; భవదీయగుణా
క్షీణప్రతిభావిభవము
ద్రోణికగా నేఁ దరింపుదున్ విపదబ్ధుల్." 33

మ. అని చింతించుచునున్న భూరమణుదీనాకారమీక్షించి యు
వ్వనితారత్నము ధైర్యమంతయు నిజస్వాంతంబులో నిల్పి నం
దనుఁడుం దానును వచ్చి పాదములమీఁదన్ వ్రాలి శోకంబు నె
క్కొనఁబల్కెన్ ఘనబాష్పబిందువులు దృక్కోణంబులం జాఱఁగన్

శా. "దీపింపంగ నొనర్తువెల్లపుడు నర్థిన్ మున్మనో మోదముల్
కోపంబింతయుఁ జూపనోడుదువు పెక్కుల్ నేరముల్ గల్గినన్
నాపూర్వంబగు కర్మమెట్టిదియొ సంతాపంబుపాలంబడన్?
బాపెం దైవము నేఁటితోడ ననునీపాదాంబుజద్వంద్వమున్.

క. కౌశికసంయమిమాయా
పాశంబులచేతఁ గట్టువడితిమి మదిలో
లేశము ధైర్యము వదలకు
మీ శాశ్వతకీర్తి సత్యమే యొనఁగూర్చున్. 36

క. క్షితినాథ! "యతో ధర్మ
స్తతో జయ", మటన్న పలుకు సకలపురాణ
స్మృతులు దెలుపంగ వందుము;
సతతము సుకృతంబు నిలుపు సత్యము బుద్ధిన్. 37

శా. శ్రీకంఠుండు పినాకపాణి గిరిపుత్రీవల్లభుం డార్తర
క్షాకేళీనిపుణుండు బాలశశిరేఖామౌళి వేదాద్రిసీ
మాకాంతీరథమూర్తి శంకరుఁడు ప్రేమం బార సంప్రీతితో
నీకాశీపురవిశ్వనాథుఁడు నీకిచ్చున్ మనోభీష్టముల్. 38

మ. విను నానోముఫలంబునన్ మగఁడ నీవిశ్వంభరామండలం
బనివార్యస్థిరకీర్తివైభవుఁడవై యాచంద్రతారార్కమిం
పునఁ బాలించెదు మానిసూనుఁడిపుడీక్రూరంపువాక్యంబులా
హీనటంచుం బరితాపమందకుము నీడెందంబునం దేమియున్.

క. నీరజబాంధవుఁ బొదివిన
ధారాధరతతులయట్లు ధరణీధవ! నిం
డారంగ నన్నుఁ బొదివిన
భూరివిపత్సముదయములు పోరిఁ బోదెఁ బాయున్. 40

తే. మున్ను మఱవుము సత్యంబు మఱవకెపుడు
నను మృషావాదిఁ జేయుదు నని చలమున
గాధినందనుఁ డొనరించు కపటకృత్య
ములకుఁ జలనంబు నొందక నిలువు మధిప." 41

# పా ప రా జు



## సీతా వనవాసము.

(జగదభిరాముం డగు రాముండు లోకవిద్రావణుం డగు రావణుం బరిమార్చి సకలసద్గుణోపేత యగు సీతను జెఱనుండి విడిపించి పరజనదుస్సాధ్య యగు నయోధ్యం జేరి యఖిలజనపూజ్యంబుగ రాజ్యం బేలుచుండె. ఇట్లు నిర్వక్రపరాక్రమంబున ధరాచక్రంబు పరిపాలించుచు, నొక్కనాఁడు రామభద్రుండు భద్రుండను చారునిం గాంచి పౌరులు దన్నుఁ గూర్చి యే మేమి యపవాదంబులు పలుకుచుండిరో దాఁపక తెలుపు మన, నాతం "డో దేవా! సకలజనంబులు భవదీయసద్గుణగణంబులం బ్రసంసింతురు గాని, కొందఱలఁతులు పగతునిచేఁ బడినపడంతిని విడిపించుకొని రాముండు మరల నేలుచున్నవాఁ డని గుజగుజలు వోవుచుండి" రని విన్నవింప, నప్పలుకులు చెవులకు ములుకులై నాట, రాఘవుండు జనాపవాదంబునకు శంకించి, యించుకయైన వెనుదీయక, తనయిల్లాలు నిండుచూలాలగుటయేనిం బాటింపక, యామెను భీకరారణ్యంబుల పాలుసేయ సమకట్టి, సౌమిత్రిని రావించి ఋష్యాశ్రమంబులఁ జూపించు నెపంబున నీవగ్గ నెను గాననంబులకుం దోడ్కొనియందు వాల్మీక్యాశ్రమంబుచెంత డించి ర"మ్మని నియమించె. అంత లక్ష్మణుండు సోదరాజ్ఞను మీఱఁజాలక జానకిచెంతకేగి ప్రణమిల్లి "జననీ! నిన్ను దపోవనంబులకుం దోడికొనిపోవ నీవిభునియాజ్ఞయైన" దని విన్నవింప, నాసాధ్వి "యిది విభునియభిమతంబ యగుటయ గాక నాకును బరమహితంబగునది" యని వచించి యత్యంత సంతోషభరితయై వెడలె. అంత లక్ష్మణుం డామెను దేరిపై నిడికొని గంగాతరంగిణీతటంబునకుం జనుచుఁ, దనకుముందుదొడరనున్న కొందలపాటు నెఱుంగక తపోవనంబుఁ జూచు తమకమ్మె డెందమ్మున సందడించుచున్నగుద నవదం జేసి యడవుల నొంటిగ నెట్లుండింతు దైవమా,! యని తలపోసి తనయుల్లం

బునఁ బెల్లగునుమ్మలికంబునం దల్లడిల్లుచు నగ్గలికం బగుబెగ్గలికం బెగ్గడిల్లి
యాపరానిసంతాపభరంబునఁ గన్నీరు మున్నీరై పాఱనేడ్చుచుండె అంత]

క. ఎదవడి పెదవులు దడుపుచు
వడవడ నెద తాల్మివదల నంగము గదలం
దూఁగ మొదలు లేనిదీనత
గదురఁగ లక్ష్మణుని సీత గనుఁగొని యనియెన్. 1

ఉ. "చిన్నఁదనంబు మించెఁబురి వెల్వడినప్పటినుండి నీ మొగం
బున్న తెఱంగుగాంచి దిగులొందుచునుండు నిదే మొయుంచు మీ
యన్నకుఁ దత్సహోదరులకాప్తులకున్ శుభమేకదన్న ! నీ
కన్నుల నేల నశ్రువులు గ్రమ్మెడిఁ దెల్పగదన్న లక్ష్మణా !

చ. అడవిని దొల్లి శ్రీదొఱఁగి యన్నను గొల్చుచు వచ్చునప్పుడున్
గడసరి యింద్రజిత్తుని ముఖాముఖిఁ గయ్యము సేయునప్పుడున్
జడుఁడగు రావణాసురుని శక్తి యురంబున నాటినప్పుడుం
బొడమను కంట నీ రిపుడు పుట్టిన దేటికొ? తండ్రి! దెల్పవే!

ఉ. అన్న ! యనేకపీనదశ లానిన వేళల నైన నీవు ము
న్నెన్నఁడు సింతవంత వహియింపవు ధైర్యము డింపవేల నేఁ
డిన్నిగులొందికుందెద ? వహీనగుణాంబుధి వంచు నీగుణం
బెన్నదు రంద ఱెవ్వరికి నెగ్గు దలంచితి వుగ్గడింపవే !

చ. పరసతు లెల్లఁ దల్లులుగ భావన సేయుదు వెల్లవేళలన్
బరధన మన్న హాలహలభంగిగఁ జూతువు బొంక వెన్నఁడుం
బరుషములాడ వెవ్వరిని బ్రాహ్మణభక్తియు రామసేవయుం
దిరమగు నీకుఁ దండ్రి! జననిందితకృత్యము లెవ్వి యియ్యెడన్

క. మన్నన దొలంగి నిను మా
యన్న నిరాకరణ చేసి యాడెనొ? నీ కా
యన్నపయి భక్తి దొలఁగెనొ?
కన్నాయము నేమి యైనఁ గావించితివో? 6

క. గురునింద యాచరించితొ?
పరదూషణ చేసితివొ? కృపారహితుఁడవై
శరణన్నవారి, ద్రోచితొ?
యరులకు వెన్నిచ్చి వేగ యరుదెంచితివో? 7

క. రామాజ్ఞ లేకయే నను
దీమసమున నిందుఁ దోడితెచ్చితొ! నాపై
స్వామిమతి యెడసియున్నదొ?
యేమిటి కడలెదవు? తండ్రి! యెఱిఁగింపఁ గదే! 8

శా. సౌమిత్రీభయమయ్యెడిన్ నుడువుమా త్స్మా దేవిజామాతయా
శ్రీమత్పద్మదళాక్షుఁ డారఘుకులక్షీరాబ్ధిపూర్ణేందుఁ డా
హేమక్ష్మాధరధీరుఁ డాయసుగమత్తేభేంద్రహార్యక్షుఁ డా
శ్యామాంగప్రభుఁ డామహాప్రభుఁడు లెస్సై యున్నవాఁ డేపురిన్.

క. "మనుమార్గనిరతుఁ డనఁగా
మనుమానవపతి దయాబ్ధి మానచ్యుతుఁడై
నిను మానెనొ? నను మానెనొ?
యనుమానము మాని తెల్పు" మన నతఁ డంతన్. 10

చ. జనకజమోముదీనతయొసంగఁగనుంగొని యారెలుంగుతో
"జననిరో! పాయదీహృదయశల్యము; శోకదవాగ్నిఁ గ్రాఁగుకం

ఔచు మరణంబు మేలు జననింపత కార్యముఁ బూనివచ్చితిన్
ననుశపియింపు" యంచుఁ జరణంబుల చెంగట వ్రాలి యేడ్చుచున్

క. తెలుపుటకుఁ గొంత చింతిలి
తెలుపకపోరా దటంచు దృఢనిశ్చయతం
దలఁచుచు వడి వేచి కృతాం
జలి యై యతఁ డశ్రులొలుక జనకజ కనియెన్. 12

ఉ. "ఇంతకుఁ బూనివచ్చి వచియింపక పోదునె? నిన్నుఁ దల్లి! మ
శ్చింతులు 'దైత్యుచేఁ బడిన సీతను గ్రమ్మఱ నేలుచున్న వాఁ
డెంత విమోహి రాముఁ'డని యెగ్గులు పల్కఁగ నాలకించి భూ
కాంతుఁడు నిందఁ జెందను గానలలో వదలించి రమ్మనెన్.

చ. జనపతి లోకనిందఁ బడఁజాలక నిన్ వనిఁ ద్రోయుమన్న చో
విని సహియించి కానలకు వేగమునం గొని తెచ్చి నిల్వఁగాఁ
జనునెవ లుగ్గడించి ధృతిసంపదఁ బొంపిరివోవుచున్న వాఁ
డను నను వంటిమూర్ఖు నకటా! విధియేగతి సృష్టిచేసెనో?

ఉ. అంచితవామలోచన! జనాంతరభూముల నిన్ను డించి రా
మ్మంచు రఘూద్వహుండని చెనక్కట! యెక్కడ నిల్చి యెట్లు వే
గించెదవమ్మ? యెవ్వరు సఖీజనులయ్యెదరమ్మ? యేమి యూ
హించి దినంబు లింకఁ గ్రమియించెదవమ్మ? పతివ్రతామణీ!

ఉ. నీ విమలప్రభావమును నీ వినయాదిక సద్గుణంబులన్
దేవుఁ డెఱింగియుండియును నిందలకుం బయిలోడి యోజగ
త్పావని! నీవు గోరిన నెపంబున నిచ్చటి కంపినాఁడు గా
కీవిరహాబ్ధి నేకరణి నీఁదఁగలాఁ డతఁ డింక మీఁదటన్? 16

ఉ. దాయలకైన నిట్టివెత దార్కొన నేగతిఁ జూడవచ్చు ? ని
న్నీయటవీస్థలిన్ విడిచి యేనెటు లేఁగుదు ? నన్ను నేల భూ
నాయకుఁ డిట్టిబెట్టిద మొనర్పఁగఁ బూన్చెనె? 'నెద్దియైన చోఁ
జేయఁగ నోడఁ డీకఠినచిత్తుఁ' డటంచు నెఱిఁగింపఁ జెనో ?

సీ. మితిలేనియీ మిడిమేలంపు మొకములు
సకియలబలఁగ మే జనని నీకుఁ ?
బరికింపరానియీ బలుమూలల్ నవరత్న
మయచంద్రశాలలే మాత నీకు ?
గడుభీతి ముంచునీగహనముల్ విహరింపఁ
దగినపూఁదోఁటలే తల్లి నీకు ?
ఘోరనక్రభుజంగకోటితో మలయు నీ
హ్రదములు కొలఁకులే యంబనీకు

తే. బంధురములైన యీమహాప్రస్తరంబు
లిందుమణివేదికలె జనయిత్రి నీకుఁ ?
గటకటా ! యెంటి నిచ్చోట నెటుల నిలిచె
దమ్మ? నీయునికి కేమందు నమ్మ నేను ? 18

మ. 'జననీ! నీవు మహాపతివ్రతవు, నీసౌశీల్య మిల్లాంద్ర కె
ల్లను మేల్బంతి రఘూద్వహాంఘ్రి యుగళీలగ్నాత్మవై యుండుమీ
యనినే నెవ్వఁడ విన్నవింపఁ? బలిఁబాయం జేసి నిన్నొంటిడిం
చినపాపాత్ముఁడ నూరికేఁగుమనుచున్ సెల్విచ్చెదే?'' నావుడున్

క. అల్లలన యతనివచనము
లెల్లన్ విని మొదలునఱక నించుకవడిలోఁ

ద్రెళ్ళెడికదలికవలె ఁహా!
తల్లీ!' యని బెట్టు సొరిగి ధరపైఁ బడియెన్. 20

వ. పడి చేడ్పడి బడిబడిం బాడముబడలిక నోడలెఱుంగక రెండుగడియ లుండి, క్రొండొకదెలిసి, వెండియు నలసి యవశమై దీనదశం బొరసి, సౌమిత్రి మరలఁ గన్ను దామరలు విచ్చి, పచ్చలవిడి వెడలెడి యశ్రుజలధారా ప్రవాహంబులు చెక్కుటద్దంబులపై జాలువాఱ నారక వెక్కివెక్కి యేడ్చుచు, నేడుపుడిచి మౌనంబుబూనుచు మౌనంబు మాని తనలోఁ దానగుచు, నగ వుడిగి తల యూఁచుచుఁ, దల యూఁచుట విడిచి ముక్కుపై వ్రేలు గీలుకొలుపుచు, జాలి గొని హాహాకారంబు సలుపుచుఁ, 'దలఁపనితలఁపు లివిగో చూచితే! లక్ష్మణా!' యని య తనిదిక్కు మొక్కులు నిగిడించి యిట్లనియె. 21

చ. "అడలకు మన్న! నీకు వసుధాధిపునానతి దాఁటవచ్చునే?
యిడుమలఁ జెందుమంచువిధి యీధరనన్ను సృజించియుండఁగాఁ
గడవఁగ నెవ్వ రోపుదురు? కానల కేఁగిననాఁడె యాపదల్
గడచితినంచునుంటినెఱుఁగం దుది నిట్లగునంచు నామదిన్.

చ. ఎడపక పూర్వజన్మమున నేమిథునంబులఁ బాయఁజేసి వా
రడలఁగనవ్వుచుండితినొ? యాయఘమూరక చన్నె? నాఁడు కా
ఱడవుల రామపాదజలజాప్తి వసించితి, నేఁడు నాథుపొం
దెడసి యనాథనై యిచట నేఁగతి మేనధరింతుఁ బ్రాణముల్?

ఆ. ఏను సాధ్వి ననుచు నెల్లవారలు నన్ను
సన్నుతింతు రనుచు సంతసింతుఁ
గాని, నడుమ నిట్టికటికనిందలు పుట్టి
యడఁపఁ బ్రోము రాముఁ డనుచు నెఱుఁగ. 24

చ. కటకట! లక్ష్మణా! పిడుగుకంటెను బెట్టిదమైనమాట నేఁ
డిటు వినియుండియుం బ్రతుకులవింతలు వింతలుగాదు గుండె, యె
ప్పటివలెనున్న దీకటికభావముతో, నసువుల్ భరించి యీ
య్యెటువిని యింక నేవలన నాపదలొందఁగనున్న దాననో?

చ. కలవరమందఁ దెల్పితివొ? కాక పరాకునఁ దప్పవింటివో?
కలనయినన్ రఘూద్వహుఁడు కానలలో ననుఁ ద్రోయఁ బంచునే
తెలిసి గణింపు లక్ష్మణ! మతిభ్రమమైనదొ? హా! సహింపు మి
ప్పలుకులె యింతకంటి వెతఁ బాటిలె శోకభ్రాంతియున్నదే?

ఉ. ఎన్నటికిన్ రఘూద్వహుని నేను మనస్సున రామచంద్రుఁడున్
గన్నులఁ జూడఁ గల్గుదొకో కల్గకయుండినఁ బ్రాణమేల పో
దన్న! రఘుప్రవీరుఁ జెవులారఁగ నింతయుఁ దెల్పు నామమే
మున్నది చెంత గంగ మదిఁ గున్నది; యైనటు లెట్లొ యుందు దిన్

చ. పతి మతి నెంచనేమొ తనుఁ బాసియు శోకవనంబులో వలెన్
బ్రతుకఁ దెపెనుఁ, నాళ్ళను చుఁ గ్రమ్మఱ రాజ్యము దెంచి శత్రునిన్
హతునిగఁ జేయునేలు ననునాస గదా బ్రతికించె నాఁటి కా
గతిఁ బికనే మియ్యాసగొని కాయము నిల్పుదు దెల్పు మిచ్చియున్.

చ. ఎఱుఁగని ఘోరఘులారమున నెగ్గులకున్ భయమందియప్పు డే
కఱకుమనంబుతో విభుఁడు కాననసీమకుఁ బంచెఁగాక, యు

త్రైజఁ గొకసారి నన్ బిలిచి తెల్పి మనోవ్యథఁ దీర్చి నిన్ను నే
మఱవని పంపఁ డెవ్వనభిమానము గాంభీర్యము నెందుఁ బోయెనో

క. ఆకరుణ యాప్రసన్నత
యాకూరిమి యాప్రియోక్తి యాగౌరవముం
గాకుత్స్థుఁడు మఱచెఁ గదా
యాకస్మికముగ జనించు నపవాదమునన్. 30

శా. ఆకర్ణాయత నేత్రమై మణిమయోద్యత్కుండలద్వంద్వశో
భాకీర్ణాంచితకర్ణమై, సురదనంబై, సుందరభ్రూయుతం
బై కమ్రస్మితచంద్రికావిలసితంబై యొప్పు శ్రీరాము మో
మీ కాయంబునఁ జూచుభాగ్యమిఁక లేదే మా సుమిత్రాత్మజా.

సీ. అవని నయోనిజ నయి పుట్టి మిథిలేంద్రు
పేట నేఁ బెరిఁగిన విధము వినరో?
యంగరాగము లిచ్చి యనసూయ మొదలైన
సతు లెంచుకొన్నది చాల వినరో?
యాలంకలోఁ దాల్మి త్రైలోక్యము నుతింప
వహ్ని నేఁ జొచ్చిన వార్త వినరో?
'యీసీత నిర్దోషి యేలుకో' మ్మని రాము
బ్రహ్మాదు లపు డన్న పలుకు వినరో?

ఆ. వినియుఁ గనియుఁ బ్రజలు నను నింద సేసిన
యంతమాత్రమునకె యధిపుఁ డులికి
యింత తెగువ సేయ నిచ్చగించుట నా య
భాగ్య మింతె; యొకరిఁ బల్కనేల?

చ. 'వనముల కేల వచ్చితివి వల్లభునిం బెడఁబాసి యొంటిగా?'
నని మునిపత్ను లెల్లగుమిగూడి యడుగఁగ ధృతిమాలి వారి కే
మని వివరింతు నింత? విపదంబుధి నేకరణిం దరింతు? నే
యనువున నీప్రతికూలమహాయుగముల్ గ్రమియింతు లక్ష్మణా!''

వ. అని పెక్కువగల నమ్మగువ వాఁగిరి మగని తెగువకుఁ బరితపించియు నించుక తగవు దలంచి తెగువ వహించి బహిర్లక్షిత చిత్రంబు క్షామ రొందియున్న యమ్మాలఁ దత్తో మఱియు నిట్లనియె.

చ. "వగపున నేఁ దొఁటినన్ని యునవారణఁ బల్కితిఁ గాక, భర్తకున్
జగదపవాదముం గడువ శక్యమె? నేను వియోగమగ్నతం
దెగునకుఁ జొచ్చి రాము జననిందితుఁ జేయుదునే? తదాజ్ఞమె
గ్గతులఁ బూని కానలమెలంగెద మేనుగలంత కాలమున్.

సీ. అన్న! లక్ష్మణ! యింక నాలస్య మేటికిఁ?
జను మయోధ్యాపురంబునకు నీవు
మువ్వుర త్తలకును మ్రొక్కితి నని తెల్పు
మచటిబంధుల నెల్ల నడిగితి నను
మతికృపాళునకును రామావనీంద్రునకు నా
మ్రొక్కుగా నతిభక్తి మ్రొక్కు మీవు
తనయాజ్ఞఁ దలదాల్చి జననింద తనుఁ జెంద
నీక కానలఁ జరియింతు నను ము

తే. భూజనుల బాంధవుల లెస్స ప్రోవు మను ము
తెలుప నా కేడుగడయును దానె యను ము

భావ మెప్పుడుఁ దనమూర్తిఁ బాయు దనుము
నెమ్మి యొకయింత నామీఁద నిల్పు మనుము. 36

తే. పోయి రమ్మి శుభంబులు పొందు నిన్ను
నన్ను మఱవకయుండుమా యన్న" యనుచు,
గన్నుఁగవ నశ్రుధారలు గ్రమ్ముకొనఁగ
నన్నెలంతుక దీన యై యడలుచున్న. 37

క. చనఁ గాళ్ళు రాక చన కీఁకఁ
జన దని ధేనువును బాయఁ జాలనివత్సం
బును బోలి జాలిగొని "యో
జననీ! జననాథుఁ గొలువఁ జనుదునె?" యనుచుఁ. 38

ఉ. అల్లన మ్రొక్కి కాళ్లపడఁ గాదఁ బ్రదక్షిణమాచరించి, మే
నెల్లఁ జలింపవాఁడు మునియేడ్చుచుఁ బెద్దయెలుంగుతోడ "మా
తల్లిని డించిపోయెదను దాపసకామినులార! కూర్మి సం
ధిల్లఁగఁ బ్రోవరే!' యనుచు దీనత లక్ష్మణుఁ డేగు నయ్యెడన్.

ఆ. ఏగి నావ యెక్కి యెడఁదఁ దల్లడపడఁ
దిరిగి తిరిగి సీత దిక్కుఁ గనుచు,
'దిక్కు కలిగి నీకు దిక్కు లే దామెఁ గాఁ
దల్లి' యనుచు నవలి తటముఁ జేరి. 40

క. చనుచుండె; నిచట సీతా
వనజాక్షియు నతఁడు మరలి వచ్చునొ యని యా
యన చనినత్రోవ పలుమఱుఁ
గనుచున్ విధి దూఱుకొనుచుఁ గటకట! యనుచున్. 41

తే. రమణి మఱికొంతనడిదాఁక రథముఁ జూచు
దగఁశి మఱికొంత సేపు కేతనముఁ జూచుఁ
గాంతి మఱిమీఁద రథపరాగంబుఁ జూచుఁ
బడఁతి మఱి యంతటను వట్టిబయలు సూచు. 42

ఆ. చూచు చూచి చొక్కి స్రుక్కి తాలిమి దక్కి
వగలఁ బొగిలి యూర్పు సెగల నొగిలి
దిగులుఁ దగులఁ గుంది వగఁజెంది బెగ డొంది
యలసి సొలసి మూర్ఛ లొలసి తెలిసి. 43

వ. అచ్చెలువ తన్నుమున్న ముచ్చట లడుగునప్పుడప్పుడమి
ఱేఁడు చేసిన చెయ్వులఁ దలంచుకొని. 44

మ. అని దుఃఖించు సపత్రపం దెలుపకాహా! భూవిభుండింతవం
చనఁ గావించునె యంచు విన్ననగు నేచందంబునం దెల్పిపొ
మ్మనెమో మోడకయుంచునెంచుఁ బతిఁ బాయం జేసి తే దైవమా
యనునింకెవ్వరుదిక్కునుం దొలఁగవే ప్రాణంబులారా! యనన్.

క. అమ్మా! యనుఁ బలుకవు నా
యమ్మా? యను జాహ్నవీ! దయానిధి! ననుఁ జే
కొమ్మా యనుఁ గలశాంబుధి
కొమ్మా! యను ఖగమృగములు గుమిగొను నడలన్. 47

వ. ఇట్లుకాంతారత్నం బుకాంతారంబున దురంతచింతా
క్రాంత స్వాంతయై యాక్రోశింప నచ్చోంతఁ జరియించు
మునికుమారులు విని వచ్చి చూచి వాల్మీకునికడ కేగి
తాముచూచిన తెఱంగంతయుం దెలుప నమ్ముని యాం-

తరగస్పృష్టింగని కలహంసపంతయు నెఱింగి, మునిబాలకులు
తనవెంబడి నేఁగుదేర గంగాతటంబు చెంగటం జేరె. 49

ఉ. ఉడుగక తేరుచన్న దెసనారసినమ్మాడ్కులుఁ గన్గొలంకులన్
విడువక పాఱునశ్రువులవెల్లువ లూఱట లేనియూర్పులుఁ
గడ యుడరానివంత నెడగాంచని చెక్కిలి కేలుధూళి బ్రుం
గుడువడు మేనునుం గలిగి కుందెడిజానకిఁ గాంచి కూరిమిన్.

మ. యతిమూర్ధన్యుఁడు బుజ్జగించి "వగ పేలా పుత్రి! నీసద్గుణో
న్నతి నీభర్తమెఱింగియుం బ్రజలనిందన్ దాల్మిఁ గుందింపఁగా
ధృతి నీ తెంపొనరించె; నింతయు మనోదృష్టిన్ విచారించి వ
చ్చితి నన్నున్ మిథిలాధినాథువలె నీచిత్తంబులో నెంచుమా!

చ. అఱమఱ యేల? నే నిలుచు నాశ్రమదేశము నీది కాదె? నీ
కెఱబఱికంబు లేక యిఁక నిచ్చట నున్నతపస్వికాంతలం
దఱు నుచితోపచారము లొనర్పఁ గలారు వివేకశాలినుల్
మఱతురె తెల్పి? దైవగతి మాన్పఁగ నెవ్వరికైన శక్యమే?

చ. జనకుఁడు తండ్రి సద్గుణవిశాలుఁడు పఙ్క్తిరథుండు మామ దు
ర్జనభుజగర్వవైభవవిరాముఁడు రాముఁడు భర్త నీకు నీ
వనుపమధర్మమర్మనిధి; వజ్ఞతఁ జెందకు నాదునాజ్ఞఁ జే
కొనిచరియింపు మేలవెతఁ గుందెద? వర్ఘ్యముఁ గొమ్మమానినీ!

క. అమ్మా! యూరక వగవక
లెమ్మా! నావనము నీకు లీలావనమౌ
రమ్మా! యివె జలములు చే
కొమ్మా! నీముఖము గడిగికొమ్మా!" యనుచున్. 54

ఆ. అనునయించి యర్ఘ్యమాయమ కిప్పించి
మానిమణి నిజాశ్రమంబునకును
గూర్మితోడఁ దోడుకొనిపోయె; నిర్వ్యాజ
బంధుజనులు గారె బ్రహ్మమునులు ? 55

# 5. సిరియాళ చరిత్రము.

శ్రీనాథుఁడు.

(హరవిలాసము నుండి)

తే. పశ్చిమంబున నింద్రచాపంబు వొడిచె
నిండినెలఁజుట్టెఁ బరివేష మండలంబు
గగన మార్గంబు నందునా గడపలెగసె
నంబుధరమాలికలు దక్షిణంబు నడచె.

క. ఉఱుముఱిమి మూలగాడ్పులు
చఱచి విసరఁజొచ్చె మదనసంహారుదెసఁ గ్రొ
మ్మెఱుఁగుద్భవించెఁ గప్పలు
గఱరవరట్కుదర వరర గట్టని యఱచెన్.

ఉ. తూనిఁగలాడఁ జొచ్చెఁ దివిదూఁటి భ్రమింపఁగఁ జొచ్చెఁ బిచ్చుకల్
మానకయుబ్బిగబ్బులుఁగుమాటికిమాటికిఁగొల్చెఁగొమ్మపై
వానయవశ్యమింక బహు వాసరముల్ జడిపట్టు నంచొగిన్
వానికి వానికాడిరి యవారణఁ బౌరులు కంచిలోపలన్.

తే. ఊలవడి చొచ్చి కామాక్షినుత్తరించె
నగరితోఁగూడ నేకామ్రనాథు ముంచె
హస్తిగిరినాథు శ్రీపాదమప్పళించెఁ
గంచిఁ దెప్పలఁదేల్చె నకాలవృష్టి.

వ. ఇవ్విధంబున నిరువదియొక్క వాసరంబులు వెలుపులేక పాము వ్రేలంగట్టిన భంగి, నింగి యవిసి కాఱిన చందంబున, సముద్రంబు వెల్లివిరిసిన లీల, వర్షంబు గురిసి యిరువదిరెండవ దివసంబునందు వెలసిన నచ్చటి వారందఱు నూరు వెడలిపోయిరిగాని,

శా. ఆముయ్యేఁడు దినంబులందు శివభక్త్యాచార సంపత్తికిన్
సీమాభూమియనం బ్రసిద్ధుఁడగునా చిర్తొండ నంబీశ్వరుం
డేమీఱాంకకపెట్టు జంగములకున్ హేరాలమిష్టాన్నముల్
నేమంబొప్పఁగ రేలునుం బగలునున్విశ్వాసపూర్వంబుగన్.

చ. అనిశమునుం గుమార సిరియాళుఁడు నాతనిదాదియైనచం
దనికయు ధన్యులప్పరమ దంపతులున్ శివభక్తకోటికై
యనుపమవృష్టి వేగఁగొనియాడుచు నెన్నియునుం దెరంగులన్
దినములు రేఁబవల్ దధిమధుప్రచురాన్నసమర్పణంబులన్.

తే. వంటచెఱకులు లేకున్న వాములైన
వస్త్రములు తైలమునముంచి వహ్నిఁ గూర్చి
వంటకంబులువండి యవ్వారిగాఁగఁ
బెట్టు శివభక్తతతికి నంబిప్రభుండు.

ఉ. జోరునవర్షము ల్గురియ సువ్రతుఁడా చిఱుతొండనంబిదై
వారెడుభక్తిపెట్టు శివభక్తులకర్థిఁ జతుర్విధాన్నముల్
తారనిమొల్పుఁ బప్పును ఘృతంబును దియ్యనిపాయసంబులున్
జారులుబిండివంటలును శర్కరయున్ దధియున్ యథేచ్ఛగన్

వ. కాని వర్షము వెలసిననాఁడు శివభక్తుఁ డొక్కఁడును రాకుండె.

క. ఏవేళఁ జూచినం దన
శ్రీవాకిటఁ బగటివేళ శివయోగివరుల్
వేవేల సంఖ్యలుండెడ
రావేళ నొకండులేమి యద్భుతమయ్యెన్.

తే. మిగుల నాశ్చర్యమంది నంబిప్రభుండు
మగఁడిలోనికిఁ జనుదెంచి మంద్రఫణితి
నోలతాతన్వి శివయోగి యొకఁడు లేఁడు
నేఁడు మొగసాల సిదియేమి మూడెనొక్కొ.

వ. నేను వెలికిం బోయి యెవ్వరైన దొరకుదురేమో చూచి వచ్చెదనని బయలుదేరి వాడవాడలఁ దిరుగుచుండెఁగాని యొక్కండును జిక్కఁడయ్యె.

తే. భ్రమసి తప్పిన పసరంబు వెదకినట్లు
జాఱి చేఁదప్పిపడ్డ సొమ్మరసినట్లు
పురములో వాడవాడలఁ దిరుగఁగఁ జొచ్చె
జంగమాన్వేషణార్థియై శైవవరుఁడు.

క. వచ్చిన వాడకు వచ్చుం
జొచ్చిన వాసంబుఁ జొచ్చుఁ జొచ్చినచోటే
యచ్చుగఁ గ్రమ్మఱ జొచ్చుం
బచ్చిశివార్చనకు శంభుభక్తుల వెదకన్.

వ. ఈ రీతిగఁ గంచియెల్ల వెదకుచు నొక్కచో నూతేండ్ల ముసలి యొకఁడు భూతి పూతఁబూసి, రుద్రాక్షల ధరియించి గ్రుడ్డియవ్వ పాదంబు లొత్తుచుండ వాని పాదంబులకుఁ బ్రణమిల్లి శివార్చనంబునకు మీరలు మాగృహంబునకు దయచేయవలయునని వేఁడిన.

తే. నెరసిప్రాలిన బొమలెత్తి పరమవృద్ధు
తలవడంకఁగనొయ్య నీ రెలుఁగు పడుచు
నంబి నెమ్మోము దేరకొనంగఁ జూచి
శివుని కారుణ్యమనుచు నాశీర్వదించె.

క. దీవించి యతని వదనము
జేవెలుఁగిడిచూచి యేమిచెప్పెదు చెప్పుమా
యేవీనుల వినఁగావున
నీవొత్తుచుఁ జెప్పు చెప్పెదేని మహాత్మా.

వ. అనినఁ జిఱుతొండండు శివార్చనంబుసేయ నీవు దేవియు విజయముచేసి మమ్ముఁ గృతార్థులఁ జేయ విభూతినందుమనుటయు

సీ. ఏఁడుగాలంబయ్యె నేను నిరాహార
ఘోరవ్రతంబుఁ గైకొన్న వాఁడ
హరుని నుద్దేశించి యమ్మహావ్రతమున
కుద్యాపనంబు పశూపహార
మయ్యాగపశువు నన్యంబేదియును గాదు
నరుఁడు కావలయు నన్నరుఁడు బ్రాహ్మ

ఈ క్షత్రియవైశ్యసంతతులలో నొక్కఁడౌ
వాఁడును గడుఁబిన్న వయసువాఁడు
గీ. రోగశంకావిహీనుండు రూపసియును
వాని తల్లియు దండ్రియు వశుగ సేసి
పాకమొనరించి వడ్డింప భవునకొసఁగి
కుడుతు నాపంక్తినీవు నీ కొడుకుఁ గుడువ.
వ. అనిన నా శివభక్తాగ్రేసరుండు.
ఆ. భక్తుఁడేవ్రతంబుపట్టె నావ్రతము పా
రంబుఁబొందఁ జేయు వ్రతమునాది
యీ వ్రతంబునాకు నెప్పుడొడం గూడ
దప్పుడు తిరుబాస యనఘ చరిత.
వ. అనుఁడు నా కపటయోగి,
తే. అందునది భూఁతిదొలుత నీ యనుఁగుభార్య
యందుఁగొనువాఁడ వీవు ననంతరమున
నాలుమగఁడును నొక కుత్తుకై నఁగాక
యిట్టి ధర్మంబు మిన్నక యేలకలుగు.
తే. నీకుఁజంపఁగవచ్చుఁబో నియమనిష్ఠఁ
దల్లికోర్వంగవచ్చు బో ధైర్యగరిమ
మాకుభుజియింప వచ్చుఁబో మనసుతివుటఁ
జిఱుతవానికిఁజావు దుస్తరముగాని.
వ. కావున నీ వింటికి బోయి నీ భార్యను గొడుకునడిగి రమ్మ
నిన నతఁడు పోయి వారును శైవవ్రతానుష్ఠాన నిష్ఠాగరి

ష్టులగుట యెఱింగి చందనికయు తమ మనస్సు కలదాని-
గాఁ దెలిసి, వచ్చి యా మాయా శివ యోగి కెఱింగించిన
నాతం డబ్బురపడి, శివపంచాక్షరిని జపించుచు గురువు
నొద్ద నీలకంఠ స్తవములు నేర్చికొనుచున్న సిరియాలు
నొద్ద కేఁగి యా బాలునితో,

శా. "అన్నా యీచిఱుతొండ నంబి యను పాపాత్ముండు
నీ తండ్రియే?
యన్నిర్భాగ్యుఁడు యోగికొక్కనికిన్ హాలామదోన్మాదికిన్
నిన్నుం జంపి మహాశహారముగ వండింపంగ నున్నాఁడు సం
పన్న స్నేహముతోడ నీకు నెఱిఁగింప న్వచ్చితిం జెచ్చెరన్.'

క. కడుపునఁ బుట్టినకూరిమి
కొడుకున్ సుకుమారమూర్తిఁ గులవర్ధను నిన్
మెడఁగోసి చంపి వండుడు
గుడుపులజోగులకుఁ బెట్టు క్రూరులుగలరే.

తే. దానవుఁడుగాక వాఁడేటి తండ్రి చెప్పుము
చెక్కునిండిన వసయొల్క చిఱుతవాని
బత్తుఁడొక్కఁడు మధుపాన మత్తుఁడగుచు
నిన్ను వేఁడినఁ జంపఁగ నిశ్చయించె.

వ. అన్నా, బ్రతికియుండిన భద్రంబులు బడయవచ్చుఁ
గావున నెచ్చటికైనఁ బోయి ప్రాణంబులు రక్షించుకొను"
మనిన నా సిరియాళుండు చిఱునవ్వు నవ్వి,

తే. ఎఱుకచాలని వాఁడందుమే దధీచి
నల్పబుద్ధులె మేఘవాహనుఁడు శిబియు
ధరఁ బరోపకారార్థమిదంశరీర
మనెడు వాక్యంబు వినవె సంయమివరేణ్య.

తే. "అధ్రువంబైన మలభాండమైన దేహ
మనఘ యన్యోపకారార్థమై వ్యయించి
ప్రవిమలంబుఁ గల్పాంతర ధ్రువమునైన
కీర్తి కాయంబుఁ గైకొంట కార్తియేల."

వ. అని విని యామాయా శివయోగి యాబాలుండు తండ్రి కంటె మిన్నయని మెచ్చి మెప్పటిచోటికిం బోవు చున్నాడు

ఉ. ఇంటికిఁదెచ్చి యోగిపరమేశునకున్ వణిజుండు తాను వా ల్గంటియుభక్తియుఁ దా భయము గౌరవమున్ వినయంబునాత్మలో నంటికొనంగనప్పు ముసలమ్మకు సైతము కమ్మనూనె మై నంటినలుంగుతో జలకమార్చియొసంగిరి ధౌతవస్త్రముల్.

వ. అప్పుడా వృద్ధురాలు వచ్చిబాలెంతరాలి వేషంబున సిరి యాళుని తల్లియొద్దకేగి, చేత శిశువుంజూపించి యమ్మా యీ పసికూన యాఁకలిచే నేడ్చుచున్నాఁడు. కొంచెము పాలు పోయుమనిన నామెయు మనస్సు చలింపక పాలు పోసె నది చూచి "అమ్మా, మీరు మీ పసిపాపనిం జంపి శివయోగికి వండిపెట్టెద" రని యూరివా రనుచుండ వింటిని. ఇట్టిమాట నే నెన్నండును విని కని యుండ లేదు.

తే. ఆవగింజంత భూతిమైనలఁది కొనిన
వెలఁది గుమ్మడికాయంత వెట్టిపుట్టు
గటకటా యెట్లు తనబుద్ధి కాటఁగలియ
నిసువుఁ జంపంగఁ దలఁచెనో నీమగండు.

క. "కానండు గాక కన్నులు
దానేమిటివాఁడు నీదుతనయుఁ జంపన్
మానవతీ ! 'మగవాఁడో,
మానో,' యనుమాట నేఁటిమాటయె చెప్పుమా."

వ. అనిన నామాటలు వినక యా తిరువేంగనాంచి "అమ్మా శివుఁడన, శివయోగి యన భేదము కలదే. శివుండుకర్త. శివుండెభోక్త. దీనికై విచారింపనేల. నీకెన్నండైనఁ బాలు కావలసిన నాయింటికి వచ్చుచుండు" మని చెప్పి యంపె నంత నాతలిదండ్రులు కుమారునికి వసుగుచేసి,

తే. తేట నులివెచ్చ నీరునఁ దీర్థమాడి
వేణియూటార్చి సురపొన్న విరులు నునిచి
మడుఁగుఁగట్టి కాటుకయిడి తొడివి పూసి
భసితరేఖా త్రిపుండ్రంబు నొసటఁదీర్చి.

వ. ఆమువ్వురును జందనికయు నేకనిశ్చయులై యుండ.

సీ. చన్నిచ్చుబాగున జనయిత్రి తొడలపైఁ
బసిబిడ్డఁ బవ్వళింపంగఁ బెట్టెఁ
జందనికతన హస్తప్రణాళంబులు
క్రిందనంటక సంతరించు కొనియెఁ

చిన్నిబుగ్గలలేఁత చిఱుతనవ్వు వెలర్ప
సిరియాలుఁడు మొగిడ్చెఁ జేయిదోయి
చిఱుతొండనంబి క్రొమ్మెఱుఁగారుచురకత్తి
వాఁడిగా నూఱుచు వంకదీర్చె

గీ. నేకమైయుల్ల మువ్వురి హృదయములును
గుంద కానందవారిధియందుఁ దేలెఁ
గురులు మువ్వురును గుమారవరునితోడ
నేకవాక్యంబుగాఁ బ్రీతి నిట్టులనిరి.

మ. మదిశంకింపకుమన్న మావలనప్రేమ స్నేహవాత్సల్యసం
పదవాటింపకుమన్న నాలుకతుదింబంచాక్షరీ మంత్రముం
బదిలంబొప్పఁ బఠింపుమన్న పరమబ్రహ్మార్థ సంసిద్ధి యి
య్యదిసుమ్మన్న యనుంగునందన సిరాలా వీరశైవవ్రతా.'

వ. అని,

ఉ. నంబి శివార్థమున్మనసు నమ్మక శంకనొకింతయేని చి
త్తంబున యందు లేక వనితామణి యూరువుదాఁపు జేసితీ
క్ష్ణంబగుకత్తి మోపమెడ గ్రక్కునఁ ద్రెవ్వినమఃశివాయమం
త్రంబుఁబఠించుచుంబడె సిరాలుశిరంబు వసుంధరాస్థలిన్.

తే. పన్నిదంబాడి గెలిచిన భావమొప్ప
నప్పు చక్కంగఁదీర్చిన యనువుమెఱయ
సతియుఁబతియును గారంపు సుతువధించి
వరుసనడపిరి వీరశైవవ్రతంబు.

చ. మిరియము నుల్లియుం బసుపు
మెంతియు నింగువ జీరకంబు శ
ర్కరయును జింతపండును
గరాంబువుఁ గమ్మని నేయి తైలమున్
బెరుగును మేళవించి కడుఁ
బెక్కువిధంబులఁ బాకశుద్ధి వం
డిరి సిరియాళునిం గటికి
డెందముసం దరళాక్షు లిద్దఱున్.

వ. ఇట్లు వండి యరఁటి యాకుల సర్వమును వడ్డించి యార
గింపుఁ డని వేడ నామాయజోగి యంతయుఁ గలయఁ
జూచి "యిందు నీకొడుకు దలయందలి మాంసము కా
న్పింపదు; మోసంబుచేసితివి. ఈయాహారంబు మే మొల్ల’
మనిన తిరువెంగనాంచియు లోనికిం జని తలమాంసంబును
దెచ్చి వడ్డించిన నక్కుహనాభైరవుండు నెండియు.

తే. ‘జంతినీవారగింపక పరమపుణ్య
నాకుఁ జేయాడునే భోజనంబుసేయ
నొకఁడు భుజియించు టెన్నఁడు నొప్పదనెడు
వేదవాక్యార్థమున్నది వినవె చెపుమ.’

వ. ఇదిగాక పసిపాపలు పంక్తిఁగూడిచినఁ గాని నాకు భోజన
మింపుగాదు; మీకొడుకుం బిలువుం’ డనిన "నయ్యా నా
కొక్కఁడె పుత్త్రుండనియు నాతనిఁ జంపి మీకాహారంబు
పెట్టియున్నారమనియుఁ దెలిసియు నిట్లుపలుకఁ బాడియే"

యని చిఱుతొండండు విన్నవించె నంత నామాయాశివ యోగి 'హోసీ, చూతము, నీకొడుకుం బిలువు మాతండు వచ్చినసరే. లేకుండిన మీరాదంపతు లిరువురును మాతో భుజింతురుగాక' యనిన తిరువెంగనాంచి పెద్దస్వరంబున.

సీ. రారా పవిత్రవంశ వారాశి హిమధామ ?
రారా వికస్వరాంభోరుహనయన
రారా మహాఘోర వీరశైవాచార !
రారా ఘనౌదార్య రాజరాజ
రారా కుమారకంఠీరవేంద్ర కిశోర !
రారా సమగ్రధీరౌహిణేయ
రారా మనోభవాకార రూపవిలాస?
రారా యసార సంసారదూర

గీ. రార నా వన్నెవసుగ! రారా తనూజ!
రార సిరియాల ! రార నా ప్రాణపదమ !
రార నాకుఱ్ఱ ! రాజయ్య! రార యనుచు
జీరెం గారాపుం గొడుకు రాజీవనయన.

వ. ఇట్లు పిలిచినంతనే నా బాలుండును నాడుకొని యింటికి వచ్చిన వానివలె వారి యెదుట నిలిచిన తల్లిదండ్రులు సంతోషించిరి. మాయయోగియుఁ దన వేషంబు విడిచి శివుండై ప్రత్యక్షమయ్యె. నాగ్రుడ్డియవ్వ పార్వతియయ్యె నప్పుడు వారు పార్వతీ పరమేశ్వరుల స్తుతించినఁ బ్రీతుండై శివుండు నీభక్తికి మెచ్చితి. మీ నలుగురికిని గైలా-

సంబు నిచ్చితినని పలికిన నాసెట్టి దేవా, ఈయేడువాడల వారును మాతోడ వచ్చినఁ గాని మే మొకళ్ళమె రాఁగలమే యనిన నా ప్రదేశమునం గలిగిన సమస్త జీవరాసులకును గైలాసంబిచ్చె.

తే. కంచిలోనేడు వాడలఁ గలిగినట్టి
నాకెపుం గోమటులతోడ నంబిసెట్టి
యఖిలజీవరాసులఁ గూడి యభ్రవీధి
భాసురస్ఫూర్తినేగెఁ గైలాసమునకు.

---

# పద్యభాగమునకు లఘుటిప్పణి.



కల్బువ్వి=రాతిబువ్వి

ఒడిపిళ్ళు=తినుబడివస్తువులు

కస్తి=దుఃఖము

కఱకుట్టు=మాంసము

తేఁకువ=భయము

వెల్లి=నీటివఱద

వేఁకి=జ్వరము

కీలాలము=నెత్తురు

2

రుగ్ణత=రోగము

అంజక=భయపడక (అంజు)

పొరిగొను=చంపు

ఒరయు=(రాచి) పరీక్షించు

అగడు=నింద్యము

పుయిలోట=సంకోచము

మనుపీనుగు=జీవచ్ఛవము

నాటకములు=ప్రవర్తనములు

3

ఎల్లి=రేపు

ఆయము=చేతికివచ్చిన పైకము

గుదిత్రోయు=కాళ్ళుకట్టిత్రోయు

వటువు=బ్రహ్మచారి

ద్రోణిక=చిన్నయోడ

అడ్డపెట్టు=నిరోధించు

చలము=పట్టుదల

4

ఎదకడి=భయపడి

అదనద=కలఁత

గడుసరి=అసాధ్యుఁడు; ధైర్యముగలవాఁడు

నెగులు=దుఃఖము

ఈఱెలుఁగు=హీనస్వరము

బెట్టిదము=క్రౌర్యము

పంచు=ఆజ్ఞాపించు

మిడిమేలము=మిడిసిపాటు

మేలుబంతి (రూ) మేల్బంతి=ఎన్నికయగు మాదిరి—(A model)

ఏడుగడ=రక్షణ

నెమ్మి=ప్రేమ

ఎలబరికము=రోఁత

అనునయించు=ఊరడించు

5

అగడపలు=దొంతిగా నేర్పడిన మేఘపంక్తి

తూనిఁగ (రూ) తూనీఁగ=ఒకమాదిరి యీఁగ

వెలుఘు=వెడలుపు

అవియు=పగులు

వాములైన=కుప్పలుగాఁబడియున్న

బెరయు—బెరసి=కలిగియుండి

బచ్చు=కోమటి

తివుట=కోరిక

ఎఱుక=జ్ఞానము

తొడివి—తొడిగి=నగలుధరింపఁజేసి

పూసి=గంధాదులు శరీరమునకుఁబూసి

కరాంబువు=చేతినీరు

# నీతిచంద్రిక.



## చిన్నయసూరి.

మగధదేశమందు మందారవతి యను వనము గలదు. అందు బహుదినములనుండి మృగకాకములు రెండు మిక్కిలి సఖ్యముతో వాసముచేయుచుండు. ఆమృగము లెస్సగా బలిసి వనములో విచ్చలవిడిసంచరించుచుండఁగా నొక నక్క చూచి యిట్లు చింతించె. ఆహా! ఈ జింక యెంతపోతరించి యున్నది. ఏలాగున దీనిమాంసము నాకు లభించును! మంచిది. దీనికి నమ్మకముపుట్టించెదనని యాలోచించి తిన్నగా సమీపముచేరి ఇట్లనియె. మిత్రుఁడా కుశలమా? అనఁగానే విని యెవ్వఁడవు నీవని మృగమడిగెను. నేను నక్కను. నాపేరు సుబుద్ధి. నా బంధువు లందఱు నన్నొంటిజేసిపోయిరి. ఈ యడవిలో మృతకల్పుఁడనయి యున్నవాఁడను. మఱియెవ్వరితోఁ గాదు. దైవముతోఁ జెప్పుచున్నాను వినుము. నిన్నుఁ జూడఁగానే నా బంధువు లందఱు వచ్చినట్లుతోఁచినది. సజ్జనదర్శనము సమస్త దోషములుపోఁగొట్టును; సర్వశుభములిచ్చునని పెద్దలు చెప్పుదురు. దానికిదే తార్కాణము. నేను నీతోడ సహవాసము చేయవలెనని మిక్కిలి కోరుచున్నాఁడను. నాకోరిక నెఱవేర్పుము. అనిన విని మంచి దాలాగుననే కానిమ్మని మృగము నక్కను వెంటఁబెట్టుకొని పోయి సాయంకాలము తన వాసస్థానము

చేరెను. అక్కడ మందారవృక్షముమీఁది కాకి తన మిత్రము యిన మృగమునుజూచి యెవ్వఁడీతఁ డని యడిగెను. ఈతఁడు సుబుద్ధియను జంబుకోత్తముఁడు. నా చెలిమి గోరి వచ్చిన వాఁడని జింక చెప్పెను. ఆ మాటలు వాయసము విని యిట్లనియె: క్రొత్తఁగా వచ్చినవానిని నమ్మవచ్చునా? ఇప్పుడు నీవు చేసినపని మంచిదికాదు. కులశీలములు తెలియక యెవ్వఁరికిఁగాని తావిచ్చుట తగదు. పూర్వము మార్జాలమునకు జరద్గవ మనుగృధ్రము తావిచ్చి మృతిఁబొందెను. అది సవిస్తరముగా వివరించెద వినుము:—

భాగీరథీతీరమందు గొప్ప జువ్వివృక్షము గలదు. దాని తొఱ్ఱలో జరద్గవమనుచీకు ముసలి గ్రద్ద వాసముచేయుచుండును. ఆవృక్షముమీఁద నివసించుపక్షులు దానికిజీవనముకయి తాము తెచ్చుకున్న మేఁతలోఁ గొంచెము గొంచెము పంచియిచ్చుచుండును. అది దానితో జీవనముఁ జేయుచుండెను. ఒకనాఁడు దీర్ఘకర్ణమనుపిల్లి పక్షిపిల్లలను భక్షించుటకై యామ్రానికడకు సద్దుచేయక వచ్చెను. దానిరాకచూచి పక్షిపిల్లలు భయపడి కూయసాగెను. ఆకోలాహలమును జరద్గవము విని యెవ్వరో పరులు వచ్చుచున్నారని యెంచుకొని యెవరక్కడనని హెచ్చరించెను. అప్పుడు బిడాలము గ్రద్దనుజూచి భయపడి హా! చచ్చితిఁగదా! కడుదాపునకు వచ్చితిని; మరిఁగిపోనయితి గాదు; తప్పించుకొనుట కుపాయాంతరము లేదు; కార్యము మించినది; ఇప్పుడు వెనుదీయరాదు; కానున్నది కాక

మానదు; "ఓటిలోఁ దలదూర్చి గోఁకటిపోటునకు వెఱవఁ దీఱునా ?" మంచిది. ఇప్పుడు మంచితనము చూపి దీనికి నమ్మిక పుట్టఁజేసెదనని యాలోచించి మెట్టయెదుర నిలిచి యిట్లనియె. అయ్యా! నమస్కారము. అనఁగానే గృధ్రము విని యెవ్వఁడవు నీవని యడిగెను. నేను బిడాలమను; నన్ను దీర్ఘకర్ణమని చెప్పుదురు. అనవిని గృధ్రమిట్లనియె. శీఘ్రము దూరముగాఁ బో; పోకుంటివా నీప్రాణములు నీవి కావు చూడు నాదెబ్బ" అనఁగానే బిడాల మిట్లనియె. ముందు నామాట వినుఁడు, నేను వధ్యుఁడనో కానో విచారింపుఁడు. తర్వాత మీకుఁ దోఁచినట్లు చేయుఁడు. గుణదోషములువిచారించి వీఁడు పూజ్యుఁడు వీఁడు వధ్యుఁడని నిర్ణయింపవలెగాని జాతిమాత్రముచేత నిర్ణయింపఁ గూడునా!' నావుడు నీవు వచ్చినపని యేమని గృధ్రమడిగెను. పిల్లి యిట్లనియె. ఇక్కడ గంగలో నిత్యము స్నానముచేయుచు మాంసాశనము విడిచి బ్రహ్మచారినై చాంద్రాయణ వ్రతము చేయుచున్నాఁడను. మిమ్ము ధర్మజ్ఞులని మంచివారని యిచ్చటి పక్షు లప్పుడప్పుడు ప్రశంసింపగా విని బహుదినములనుండి నాకు మీ దర్శనము చేయవలెనని కోరికకలదు. అది యిన్నాళ్ళకు ఫలించినది. మీరు విద్యావయోవృద్ధులు. కాఁబట్టి మీవలనధర్మములు వినవలెనని సంతతము మనసు కలదు. ధర్మజ్ఞులయిన మీరే యిల్లుతొక్కికొని వచ్చినవానిని వధింపను యత్నముచేసితిరి. గృహస్థధర్మమా యిది! శత్రువున కయినను గృహమునకు వచ్చినవాని కాతిథ్యము చేయవలసినది. ధనము

లేని పక్షమునకు మంచిమాటలతోనైన సత్కరింపవలెను. ఇంటికి వచ్చినయతిథి యుస్సురని పోరాదు. అది మిక్కిలి పాపమునకు మూలము.' అనగా విని గ్రద్ద యిట్లనియె. 'పిల్లులకు మాంసమందు రుచి మిక్కుటము. ఇక్కడ నాపక్షి పిల్ల లున్నవి. అందుచేత నే నట్లు చెప్పితిని.' అనఁగానే పిల్లి రెండు చెవులు మూసికొని కృష్ణ! కృష్ణ! యని యిట్లనియె. ఎంతపాపముచేసియీపిల్లి జన్మమెత్తితినో యిదిచాలకయీ పాపము సహితము కట్టుకోవలెనా? ఎంతమాట వినవలసి వచ్చెను. ధర్మశాస్త్రములు విని నిష్కాముఁడనై యిప్పుడు చాంద్రాయణవ్రతము చేయుచున్నాఁడను. నే నిట్టి పాపము చేయుదునా ? పరస్పరవిరుద్ధము లయిన ధర్మ శాస్త్రములు సహితము "అహింసా పరమోధర్మః" యనుచో నైకమత్య ముగలిగియున్నవి. ఏహింసగానిచేయక సర్వభూతములయందు దయాళువులయి వర్తించువారికి స్వర్గముకరస్థము. భూతదయ కలవాఁడెసర్వధర్మములుచేసినవాఁడు. అదిలేనివాఁడు చేసియుఁ జేయనివాఁడె. కడపటఁ దాను జేసిన ధర్మము తనకు సహా యమయి వచ్చునుగాని తక్కినది యేదియు లోకములోనిది తోడరాఁబోదు. తెలియక చెడినకాలము పోనిమ్మ. తెలిసి యింకఁజెడుదునా ? అడవిలో స్వచ్ఛందముగా మొలచిన యేశాకముతోనయిననుక్షుధఁదీర్చుకొని ప్రొద్దుఁబుచ్చవచ్చును. ఈ పాడుపొట్టకయి యింత పాపముచేయుట కెవ్వఁడు పాలు పడును ? ఆహా! యెంతమాటాడితిరి. అనఁగా గ్రద్దవిని కోపముచేయకు, క్రొత్తగారాఁగానే వచ్చినవారి స్వభావ

నీలాగునఁ దెలిసికోవచ్చును? అప్పుడు తెలియక చెప్పిన మాట తప్పుగాఁ బట్టఁబోకు. పోయినమాట పోనిమ్ము. నీవు యథేచ్ఛముగా రావచ్చును బోవచ్చును మాకడ నిలువ వచ్చును. నీ కొక యడ్డంకి లేదని చెప్పెను. అనంతరము మార్జాలము జరద్గవముతో మిక్కిలి సఖ్యము గలిగి యా తొఱ్ఱలో వాసము చేయుచుండెను. ఇట్లు కొన్ని దినములు కడచిన తర్వాత మార్జాలము ప్రతిదినము నడికిరేయి చప్పుడుచేయక వృక్షమెక్కి పక్షిపిల్లలను గొంతుకొఱికి తెచ్చి తొఱ్ఱలోఁ బెట్టుకొని తినసాగెను. అక్కడి పక్షులు తమపిల్లలను గానక మిక్కిలి దుఃఖించి యక్కడక్కడ వెదక నారంభించెను. అది యెఱిఁగి పిల్లి తొఱ్ఱవెడలి పాఱిపోయెను. ఆ పక్షులు వెదకుచువచ్చి తొఱ్ఱలోఁ దమ పిల్లల యెముకలు చూచి యీగ్రదయే మన పిల్లలను భక్షించినదని నిశ్చయించి దానిని గోళ్ళతో అక్కి చంచువులతోఁ బొడిచి చంపెను.

---

# విష్ణువర్ధనుఁడు.

ఆంధ్రవీరులలోఁ జాళుక్యులు మిగులఁ బ్రసిద్ధులు. వీరల నామము దేశచరిత్రములయందుఁ జిరకాలమునుండి వినఁబడుచున్నది. మన చరిత్రకారులువిషయసుబోధమునకుఁగాను రాజమహేంద్రవరప్రాంతము పాలించినవారిని దూర్పు చాళుక్యులనియు నిజాము రాష్ట్రమునందలి కుంతలదేశమును బాలించినవారినిఁ బశ్చిమచాళుక్యులనియుఁ బేరిడిరి. మన మిప్పుడు చదువఁబోవు ప్రసిద్ధపురుషుఁడును వీరోత్తంసుఁడు నగు విష్ణువర్ధనమహారాజీ యుభయ వంశజులకు మూలపురుషుఁడు. చాళుక్యరాజుల చరిత్రములలో నీయనఘుని జీవిత చరిత్రము మేలుబంతిగా నున్నది.

చాళుక్యుల జన్మాదికములనుగూర్చి యనేక కథలు గలవు. గ్రంథములందు శాసనములందును జాళుక్యులు చంద్రవంశక్షత్రియులుగాఁ జెప్పఁబడిరి. బ్రహ్మదేవుఁ డొకనాఁడు పేరోలగమున నుండఁగా నచటకు సురపరివృతుఁడగు దేవేంద్రుఁ డరుదెంచి యుచితసత్కారములొంది యాసనాసీనుఁడై 'వాణీవల్లభా! కలియుగమాహాత్మ్యమునఁగాఁబోలు ధర్మము సన్నగిల్లినది. మనుజులు యజ్ఞయాగాది క్రతువులు చేయుట లేదు. ప్రజలను ధర్మమార్గమునఁ ద్రిప్పఁగలరాజును సృజింపు' మని వేఁడుకొనెను. బ్రహ్మయందుల కంగీకరించి ఇంద్రునిఁ

బంపివేసెను. ఉత్తముఁడగు రాజును సృజింపవలయునను నాందోళనములో నుండి బ్రహ్మ యర్ఘ్యమిడుటకై జలము పైకెత్తగా నతని చులుకము (పుడిసిలి) నుండి తేజస్సంపన్నుఁడు వీరవతంసుఁడునగు నొక మహాపురుషుఁ డుద్భవమయ్యెను. ఆవీరుఁను బ్రహ్మను జూచి 'నన్నేల సృజించినాఁడవు? నా కర్తవ్యమేమి?' యని యడుగఁగా 'నీవు చులుకమునందు జనించితివి గావున చాళుక్యుఁడవు. ధర్మము దప్పనీయక ప్రజలఁ బాలించి యుత్తమ క్షత్రియవంశమునకుఁ గర్తవుగ' మ్మని యాశీర్వదించి వానిని భూలోకమునకు బంపెను. తరువాత చాళుక్యుఁడు తపస్సంపదచే గొప్పశక్తి గడించి రాజ్యము స్థాపించెను. ఈయన రాజధాని యయోధ్య. ఈయనవంశమున మిగులఁ బ్రసిద్ధులగు హారితుఁడు, మానవ్యుఁడు అను నిద్దరు వీరులు జనించిరి. తరువాత నీ వంశీయులలోఁ గొందరు దక్షిణాపథమునకు వచ్చి స్వతంత్ర రాజ్యములు స్థాపించి యార్షమతము నుద్ధరించిరి. ఈ చాళుక్యులను మానవ్యసగోత్రులని వ్యవహరించు చున్నారు.

దక్షిణాపథమునఁ బ్రసిద్ధుఁడై యున్న విజయాదిత్యుఁడను చాళుక్యరాజు అపరిమిత సైనికబలముతో దండయాత్రకు బయలువెడలి త్రిలోచన పల్లవుఁడను సుప్రసిద్ధనృపాలుని రాజ్యమును హరింపనెంచి చిరకాలము యుద్ధముగావించెను. పరాక్రమశాలియగు త్రిలోచనపల్లవుఁడు ఆకాలమునఁ బ్రసిద్ధులగు పల్లవరాజులను సహాయముగాఁ దీసికొని విజయాదిత్యు

నితో నెలలతరబడి పోరాడి యాతని మడియించెను. సైనికు లందఱు రాజుపడుటఁజూచి చెల్లాచెదరై పోయిరి. విజయాదిత్యు ని పట్టపుభార్య యాసమయమున గర్భవతిగానుండెను. స్వార్థప రాయణులగు సైనికులు భటులు తమత్రోవను దామేఁగుటచే గాంశి దిక్కుమాలినదై విరోధిరాజులచేఁ బట్టువడిన నాపద కలుగునేమోయని చాల విచారపడెను. గర్భవతిగానుండుటచేఁ జాళుక్యవంశాంకురమును దగ్ధముచేసి సహగమనముగావించుట కంగీకరింపకపోయెను. త్రిలోచనపల్లవుని ధాటికి వెఱచి రాజ మహిషి కెవరును దావొసంగరైరి. విశ్వాస పాత్రురాండ్రగు పరిచారికలు, పురోహితుఁడు జాగరూకతగా రాజపత్నిని గాపాడి శిబిరమునుండి యర్థరాత్రమున నామెను వెంటనిడి కొని మహారణ్యమునకుఁ జేర్చి కొన్ని దినములకు ముదివేము అను నగ్రహారమునకుఁ జేరిరి. అగ్రహారాధిపతి పేరు విష్ణు వర్ధనభట్టారకుఁడు. సమస్త శాస్త్ర పారంగతుఁడు. అతిథిపూజా పరాయణుఁడగు నీ బ్రాహ్మణుఁడు తన యగ్రహారమునకు వచ్చిన నూతనుల నందఱను గృహమునకు రావించి యాతిథ్య మొసంగి సత్కరించెను. చాళుక్య పురోహితుఁడగు బ్రాహ్మ ణుఁడు విష్ణువర్ధనభట్టారకునితో నేకాంతమునఁ జాళుక్యవంశ మునకుఁ గలిగిన విప్లవము, విజయాదిత్యుని యకాలమరణము నివేదించి రాజపత్నిని నాయనపాదములపైఁ బడవేసి చాళుక్య వంశాంకురమును గర్భమున ధరించిన యీసాధ్విని గాపాడు మని వేఁడుకొనెను. విజయాదిత్యుని, నాతని ధర్మపత్నిని

స్వయముగా నెఱింగినవాఁడు కాన విష్ణువర్ధనుఁడు గతమునకుఁ జింతించి రాజపత్నిని నోదార్చి పుత్త్రికా భావముతోఁ బ్రేమింతునని వాగ్దానము గావించి రాజపత్నినిఁ దనయింట నుంచికొని వేయికన్నులతోఁ గాపాడుచుండెను.

విష్ణువర్ధన భట్టారకుఁడు సమయోచితములగు పురాణ కథాదికములచే భర్తృచింతయంతయు రాజపత్నికిమఱపునకు వచ్చునటులఁజేసి వీరమాతవు గమ్మని యాశీర్వదించెను. నవమాసములు నిండినపిమ్మట నొక శుభముహూర్తమున రాజపత్ని తేజోవంతుఁడును రూపవంతుఁడును నగు నొక కుమారునిఁగనెను. విష్ణువర్ధన భట్టారకుఁడా బాలునిజననకాల మునుబట్టి జాతకము వ్రాసి యీబాలుఁడు పూర్ణాయుర్దాయ సముపేతుఁడై యాంధ్రదేశము నంతయుఁ బరిపాలించు రాజు కాఁగలఁడని తెలిసికొని మిగుల వైభవముగా జాతకర్మాదిక ములు ముగించెను. రాజపత్ని, విష్ణువర్ధనభట్టారకుఁడు తన కొనరించిన మేలునకుఁ దనవంశమునిలిపి కావించిన మహోప కారమునకుఁ బ్రతిఫలముగఁ దనకుమారునకు విష్ణువర్ధనుఁడని నామకరణము గావించెను. కొడుకులు లేరను విచారముమాని విష్ణువర్ధన భట్టారకుఁ డాబాలునిఁ దనకుమారునివలెనే గారా బముతోఁ బెంచి పెద్దవానిఁజేసి బాల్యముననె పురాణవీరుల విక్రమములు బోధించి వేదము, శాస్త్రము, ధనుర్విద్య నేర్పిం చెను. సమస్తవిద్యలయందును నాబాలుఁడు ప్రవేశముగల వాఁడై సర్వశాస్త్రపారంగతుఁడై యొకానొక దినమునఁ దన

తల్లియొద్దకేగి 'మనలను క్షత్రియులని లోకులు చెప్పుకొను చున్నారు. మనము బ్రాహ్మణగృహములోఁ జిరకాలమునుండి యుండుటకుఁ గారణమేమి? నాతండ్రి యెవరు? నేనేశాఖకు జెందినవాఁడనో యాజ్ఞ యి" మ్మని యడిగెను. కుమారుని మాటలు విన్నంతనె పట్టరాని దుఃఖమున రాజపత్ని పరితపించి కుమారునకేమియు బదులు చెప్పఁజాలకపోయెను.

విష్ణువర్ధన భట్టారకుఁడు విచారపరవశురాలై యున్న రాజపత్నినిఁ జూచి "చింతిలగారణమేమి? నావలన నేమేని ప్రమాదము జరుగలేదుగదా? గడుసరియై నీకుమారుఁడేమేని నొవ్వనాడెనా? తెలుపు"మని పలువిధములనడిగెను. విచారాతిశయమున రాజపత్ని బదులాడఁజాలకపోయెను. విష్ణువర్ధనుఁడు బ్రాహ్మణోత్తమునకు నమస్కరించి తానే తల్లి విచారపడుటకు గారకుఁడనియుఁ దనకులశీలాదికముఁ బ్రశ్నించుటచే నిటులఁ బలవించుచున్నదనియు నివేదించెను. విష్ణువర్ధన భట్టారకుఁడు బాలునిఁ జేరఁజీరి గతవృత్తాంతము, తల్లి యుచటికివచ్చిన హేతువు, తానామెను దననుసాదరమునఁ బోషించుచున్న విషయము నివేదించెను. రాజకుమారుఁడు కనుల నెఱు పెక్క 'బ్రహ్మజ్ఞ శిరోమణీ! తెలియక ముందు నీసొమ్ము దింటిని. నీకుఋణపడి యున్నాను. ఈజన్మమున నీఋణము తీర్చుకొనఁ గలుగుదునేని ధన్యుఁడను. నాతండ్రినిఁ జంపిన పల్లవుల మారణముగావించుటయు నచిరకాలమున మహాసామ్రాజ్యము స్థాపించి మాకుటుంబమునెడ ననురాగముఁ జూపిన ధన్యుల గౌరవించు

టయు నాకర్తవ్యము. నేనిఁక నాజ్ఞపుచ్చుకొందు సెలవిం' డని పలికెను. బ్రాహ్మణుఁడు బాలుని బుత్త్రప్రేమతోఁ బెంచిన వాఁడగుటచే నెడబాటునకు సహింపఁజాలక 'నేనును నీవెంట వచ్చి నీకనుకూలమగు పరిచర్యగావింతు'ననెను. రాజపత్నియుఁ గుమారుని విడువఁజాలక తాను గానుద్దేశించెను. బాలుఁడెట్ట కేలకుఁ దండ్రివలె దన్నుఁబెంచు బ్రాహ్మణోత్తముని దల్లిని ఒప్పించి వారొసఁగిన దివ్యాశీర్వాదములను బడసి తపశ్శక్తిచేఁ గాని విజయము లభింపఁజాలదని మహారణ్యములకుఁ బోయెను. రాజకుమారునకు బయలుదేరినదిమొదలనేక శుభశకునములయ్యెను. అన్నియుఁ దన భావ్యభివృద్ధి సూచకములుగాఁ దలంచి దేవతానిలయమనియుఁ జాళుక్యులతపోభూమియనియుఁ బేరొందిన చాళుక్యపర్వతమున కేఁగి రాజకుమారుఁడు చిర కాలము తపస్సుచేసెను. సప్తమాతృకలతోఁ గుమారస్వామి యీబాలునకుఁ బ్రత్యక్షమై 'నీవెచటికేఁగినను సింహము వలె విజయము గడింతువు గాన విజయసింహనామము ధరింపుమనియుఁ జిరముగ మీవంశము నిలుచుటకు విష్ణువర్ధనభట్టారకుఁడే కారకుఁడుగాన వంశీయులందఱు నామాంతరమున విష్ణువర్ధనపదముఁ జేర్చుకొనుఁ'డని చెప్పియాశీర్వదించి యంతర్ధానమాయెను. కొంతసేపటికి శ్రీమహావిష్ణువుప్రత్యక్షమై వరాహధ్వజము నొసంగి యీధ్వజ సహాయమున విరోధిరాజుల జయించి పేరుగాంచఁగలవని యాశీర్వదించియదృశ్యమయ్యెను. విజయసింహ బిరుదాంకుఁడగు విష్ణువర్ధనుఁడు గృహము

చేరి బ్రాహ్మణోత్తమునకును దన తల్లికిని జానొందిన వరములను దెలిపెను. విష్ణువర్ధన భట్టారకుఁడు మిగుల సంతోషించి విజయసింహునకు దిగ్విజయయాత్రగావింప నొక శుభముహూర్తము నిశ్చయించెను. తల్లి బాలునకు వీరవేషము వేసి యాశీర్వదించి పంపెను.

విజయసింహుఁడు దైవబలముతో జైత్రయాత్రకు బయలుదేరు చున్నాఁడని విని రాష్ట్రకూటులమొదలను బల్లవులమొదలను ద్వేషభావముగల పౌరులనేకులు జయసింహునకు ధనసహాయము గావించిరి. తన తండ్రినాఁటి భటులలోఁ బలువురు తమకుఁ దామ వచ్చి జయసింహునిఁ గలిసికొనిరి. అపరిమిత బలముతో బయలుదేరిన విజయసింహుని ధాటికి రాజులెవ్వరు నాఁగఁ జాలక పోయిరి. ఆకాలమునఁ బ్రసిద్ధులుగా నున్న కదంబరాజులు గాంగరాజులు కొంతవఱ కెదిరించి పరాజయశరణ్యులై యంకితులైరి. రాష్ట్రకూటులలోఁ గృష్ణుఁడను రాజు కాలమునఁ బ్రసిద్ధుడుగా నుండి విస్తారవిశాలమైన దేశమును బాలించుచుండెను. అతని కుమారుఁడు ఇంద్రవర్మ. తండ్రినిమించి తనరాజ్యమున విరోధియనువాఁడు లేకుండఁ జేసి శత్రుజన భీకరుఁడై రాజ్యము నేలు సమయమున విజయసింహుఁ డాతనిపైకి దండయాత్రకు వెడలెను. ఉభయ సైన్యములకుఁ జిరకాలము భయంకర సంగ్రామము జరిగెను. దురదృష్టవంతుఁడగు ఇంద్రవర్మబలము సన్నగిల్లెను. చేయునది లేక యపజయము నిశ్చయమని తెలిసికొని విజయ

సింహుని శరణు వేఁడఁగా శరణాగతత్రాణ బిరాంకుండగు నారాజన్యుఁడు అపరాధముగాఁ గొంతధన మాతని నుండి కైకొని సామంతుఁడుగ నేర్పాటుచేసెను. పల్లవులపై సహజ ద్వేషభావములుగల యీరాజతిలకుఁడు చిక్కిన పల్లవరాజును జిక్కినటుల బంధించి తండ్రినాఁటి పగను వడ్డితోఁ గూడఁ దీర్చుకొని దక్షిణాపథమున నింతటి రాజు లేఁడను ప్రతిష్ఠ వహించెను.

విజయసింహుఁడు విజయయాత్ర ముగించి యగ్రహార మునకుఁ జేరి తన విజయకథలు తండ్రితో సమానుఁడగువిష్ణు వర్ధన భట్టారకునకుఁ దల్లికి నివేదించెను. తరువాత నొకశుభ ముహూర్తమునఁ జాళుక్య సామ్రాజ్యమును వాతాపియను నగరమునందు స్థాపించి ప్రాక్పశ్చిమ చాళుక్య వంశములు రెంటికిని మూలపురుషుఁ డయ్యెను. కాంచీ నగరమునందుఁ బల్లవరాజ్య మొకటి యాకాలమునందు సుప్రసిద్ధముగానున్న వార్తవిని విజయసింహుఁ డపరిమిత బలసమేతుఁడై దండ యాత్రకు బయలువెడలెను. పల్లవరాజీవర్తమానమువిని ప్రతి ఘటించినచోఁ బరువుదక్కుట దుస్తరమని తనకుమార్తె నాతని కొసంగి పరిణయముగావించి రాజ్యములోఁ గొంత భాగము సరణముగా నిచ్చెను. విజయలక్ష్మితో సర్వాంగ లక్ష్మితో విజయసింహుఁడు తననగరముఁ జేరి విజయాదిత్యుఁ డను కుమారునిఁ గాంచెను. ఈనృపాలుఁడు క్రీ. శ. ४५० ప్రాంతమున నుండి యుండునని చరిత్రములవలనఁ దెలియు.

చున్నది. ద్రవిడాంధ్ర కర్ణాటమహారాష్ట్ర దేశములు చిర కాలము పరిపాలించి ధర్మసంస్థాపనము గావించిన లోకోత్తర కీర్తిధుర్యులగు చాళుక్యులలో విజయసింహుఁడు ప్రథమగణ్యుఁడు. ఈయన సంపూర్ణ జీవితము వెలుఁగెుదగు నాధారము లింతవఱకు వలసినన్ని లభింపవందున విస్తరించి తెలుపవీలు కాదయ్యెను. అసహాయస్థితియందుండి స్వశక్తిచే లోకోత్తర ఖ్యాతినొందిన విజయసింహుని కార్యదీక్ష కార్యశూరులగు నాంధ్రసోదరులకు మార్గదర్శక మగుఁగాక !

# దుష్యంత చరిత్రము.

కళువె వీరరాజకవి.

అంత నొక్కనాఁడు మహీరమణుండు కాననంబునం గల నానామృగంబుల వేఁటలాడవలయు నను తలంపున ఖడ్గ శక్తిగదాముసల తోమరహస్తులగు యోధకులును రథగజతురగ సహస్రంబు లుభయపార్శ్వంబుల బలసి కొలువ నగరంబు వెలువడునప్పుడు యోధవరుల సింహనాదంబులును భుజాస్ఫోటనిస్వనంబులును రథనేమినిర్ఘోషంబులును మత్తగజఘీంకారంబులును దురంగంబుల హేషారవంబులును శంఖదుందుభిధ్వానంబును నొక్కమొగి దిక్కులం బిక్కటిల్లె. మఱియు నమ్మహీపాలునిఁ గనుంగొనవలయునను గుతూహలంబునఁ బౌరకాంత లత్యున్నతంబు లగు సౌధంబు లధిరోహించి రూపరేఖా విరాజమానుండును మహేంద్ర నిభ వైభవుండును సకల శాస్త్రవిచక్షణుండును నగు నమ్మహామహీపాలుఁ గనుంగొని యితండు తారకాసుర సంహారకుండగు కుమారుండు గావలయు నని తలంచుచు సమరంబున నితని కట్టెదుటం బడిన శాత్రవుండు క్రమ్మఱం బ్రతికిపోవుట కెంతవాఁడు గావలయుఁ గావున నితని పరాక్రమంబు లోకాద్భుతంబని యితని మీఁది ప్రేమాతిశయంబునఁ బుష్పవర్షంబు గురియించిరి. అంత నమ్మేదినీకాంతుండును విప్రజనసంస్తూయమానుం

డగుచు వనంబున కరుగు నవసరంబునఁ బౌరజానపదజనంబులు కొంతదూరం బతని వెంబడించి వచ్చి యతని యనుమతంబున మగుడఁ బురంబున కరిగిరి. అంత నద్ధరణీవల్లభుండునుఁ గాంచనమయంబగు రథంబు నడపించుచుఁ దదీయనేమి నిర్ఘోషంబున భూనభోంతరంబుల నించుచుం జని చని కొంత దూరంబున బదరకపిత్థబిల్వార్క వటప్రముఖభూరుహశోభితంబును విషమభూమి పర్వత పాషాణ దంతురంబును నిర్జలంబును నిర్మనుష్యంబును బహుయోజనాయతంబును నగు నరణ్యంబు సొచ్చి వివిధమృగంబులం గలంచి వేఁటలాడుచు బాణగోచర శార్దూలంబుల మర్దించుచు మఱియుఁ దన సమీపంబునకు వచ్చుచున్న దుష్టమృగంబుల శక్తిధరునిచందంబు నేజలం గొనియేయుచు మృగంబులమర్మంబు లెఱింగి తత్ప్రదేశంబుల నొప్పించుచుఁ తోమరగదాసిముసల ప్రముఖంబు లగు నానావిధాయుధంబులం గొని మదించి తిరుగువనగజంబుల నొప్పించుచు నమ్మహారణ్యంబున సంచరించుచుండె. ఇవ్విధంబున సబలవాహనుం డగు నమ్మహీవిభునిచేతఁ గలంకంబడి యవ్వనంబుననియతావాసంబులయ్యునపారభయాక్రాంత చిత్తంబులగుటం జేసి యందునిలువంజాలకమృగంబులుగుములు గుములుగా వెడలునవియును గుంపులు చెదరి పఱచునవియును యూథపతివిహీనంబులగుచు మహాభయంబున నార్తస్వనంబులు నిగిడించునవియునుక్షుత్పిపాసాపరవశత్వంబంది జలవిహీనంబులగు నదీప్రదేశంబులంగనియందు సలిలంబులుగానక మూ

ర్ఛిల్లిపడునవియును వెంటనంటి పఱతెంచు రాజభటుల చేతం దవిలి భక్షింపంబడునవియును నాటవికజనంబులచేత మర్దితం బులును బ్రజ్వలితంబగు ననలంబున భక్షణార్థంబుగ దహింపఁ బడునవియును నై నానావిధంబులఁ బొడవడంగఁ దొడంగె. అంత మత్తగజసంఘంబుల యోధవరులు శస్త్రఘాతంబు మిగుల దోర్ప తొండంబులు చుట్టుకొని శక్రుమ్మాత్రంబులు విడుచుచు గాయంబులఁ గొత్తనెత్తురులు దొరుంగ సత్వరం బుగాఁ జనుచు వనంబులం గల మృగంబుల నెల్లఁ గలయం ద్రొక్కుచు దిక్కులకుం బఱచె. అంత నవ్వనంబును మహీ కాంతుని సైన్యం బను మేఘంబునం దొరుగు వివిధశరధారల నా వృతం బగుచు మహిమంబు లెల్ల నొడలం దిరుగ వర్షాకాలం బునం దనరువనంబుకరణిం జెలంగె. ఇవ్విధంబున నమ్మహీ పాలుండు వివిధమృగంబుల వేఁటాడుచుఁ జతురంగబలసమే తంబుగా వనంబు గడచి కొంతదూరంబున ధరణీతలంబున వ్రాలినమేఘంబు ననుకరించుచు సిద్ధచారణసేవితం బగు నొక్కవనం బఱుగొని నగరంబునకు యోజనద్వయంబునం గనుపట్టునవ్వనంబు ప్రవేశించి యందు గల నానామృగంబుల వెంబడించుటకు నాశ్వికులుం దానును మరల దూరంబుగం జనిచని శమభారపీడితుండును క్షుత్పిపాసాపీడితుండును నగుచు నవ్వనంబు గడచి యొక్కరుండును వనాంతరంబున కరిగి యవ్వనంబు గడచి యవ్వల నూషరప్రదేశంబు గని యదియు నతిక్రమించి యావల నుత్తమ తాపసాశ్రమ సమన్వితంబును

మనః ప్రమోదకారణంబును నిఖిలజన మనోహరంబును శీత మారుతసమేతంబును బుష్ప ఫల భరిత పాదపాకీర్ణంబును మృదుల తృణరమణీయప్రదేశంబును శ్రుతిమనోహర శుక శారికాది మృదుల నినాద మేదురంబును శీతలచ్ఛాయాసమన్వితంబును భృంగఝంకారమనోహరంబును బరమశోభా విభాసితంబును నగు నవ్వనంబు గనుంగొని యందుఁ గలపాదపంబులలోన నొక్కటేనియుఁ గుసుమంబులు లేక యుండునదియును గంటక సమన్వితం బగునదియును దుమ్మెదలు లేక యుండునదియును లేక యుండుటకు సంతసిల్లుచు నవ్వనంబు గలయం బ్రవేశించి గనుంగొనునెడ నందుఁగల నానావృక్షంబులును మందమారుతగళితంబులగు కుసుమంబు లతనిమీఁద వర్షించుచుఁ గుసుమ కిసలయభారావనతంబు లగుకొమ్మలం దున్న శుకశారికాది విహంగంబుల మధురకూజితంబులవలన నింపు పుట్టించుచు నిరంతరకుసుమ సమావృతంబు లగుటం జేసి మేలిపట్టుదుప్పటంబులు గట్టిన చెలువునం దనరుచు నెమ్మనంబునకు సమ్మదంబు గావించుచున్న పూఁబొదల వలన మనోహరంబు లగుచు మహీవల్లభుని చిత్తంబునకు సంతోషంబు గల్పించె. అంత మహీకాంతుండు నింద్రధ్వజంబుల చందంబున సమున్నతంబు లగుచుఁ బరస్పరంబు కలయంబడి కుసుమశోభితంబులగు శాఖాగ్రంబులం గల భూరుహంబులవలనను సిద్ధచారణగంధర్వాప్సరో గణంబుల విహారంబులవలనను మదవారణకిన్నర సంచారమ్ములరమణీయంబు

లగుస్థానంబులవలనను గుసుమపరాగభరితంబును సుఖశీతల స్పర్శగంధంబును నగుమందమారుతంబు వలనను నెంతయు సంతసిల్లుచు నందొకనదీతీరంబున నానామృగగణాకీర్ణంబును బహువిధవిహంగకోలాహలభరితంబును బ్రజ్వలితపావకంబును వాలఖిల్యప్రముఖ మహామునిగణాకీర్ణంబును నగ్నిహోత్ర గృహాభిరామంబును నగునొక్కదివ్యాశ్రమంబు గనుంగొని యయ్యాశ్రమంబునకు సమీపంబునం బ్రవహించుచు హంస సారసచక్రవాక ప్రముఖంబు లగు జలవిహంగమంబులం దన రుచు నిఖిలముని జనంబునకు మనోహరం బగు సౌమ్యమృగ సంచారయోగ్యంబు లగు తీరంబుల నరుగుచు దేవలోకంబు నకు సమానం బగుపుణ్యాశ్రమంబునకు భూషణం బగుచు సకల ప్రాణిసంఘంబునకుఁ దల్లిపోలికం గనుపట్టుచుఁ జక్రవా కమిథునసంచరితంబులగు సైకతంబుల వెలయుచు ఫేనంబుల నలరుచు సుపుష్పంబుల భరించుచు వానరాచ్ఛభల్లకిన్నర సంచారంబుల నొప్పుచు దృఢవ్రతు లగు మునికుమారుల స్వాధ్యాయంబునను సకలమునిజన సేవితం బగుకాశ్య పాశ్రమంబుసమీపంబు చేరి భాగీరథివలన నరనారాయణా శ్రమంబునుంబోలె నమ్మాలినీవనంబుఁ గుసుమఫలభరిత వృక్షాలంకృతంబును మత్తమయూర కూజింతంబును జైత్ర రథతుల్యంబును నగునయ్యాశ్రమంబు బ్రవేశించి యమ్మ హర్షిని సేవించుతలంపున రథగజపదాతిసంకులం బగు నిజ సైన్యంబును నయ్యాశ్రమవనంబునకు వెలుపటి నుండ నియ

మించి ఛత్రచామరాదు లగురాజచిహ్నంబులు పరిహరించి యమాత్యపురోహిత మాత్రసహాయుం డగుచు బ్రహ్మలోక సమానం బగు నయ్యాశ్రమంబున వేదవేదాంగపారగులును న్యాయతత్వార్థవిజ్ఞానసంపన్నులు నగు కొందఱు విప్రపుంగవులు పదక్రమయుక్తంబుగ ఋగ్వేదంబు పఠించుచందంబును మఱియును గొందఱు యజ్ఞస్వరూపప్రకాశకంబు లగుయజుర్వేదంబును వర్ణక్రమ జటాసమన్వితంబుగ నధ్యయనంబు సేయు తెఱంగును మఱియును గొందఱు మధుర స్వరంబుల నియతవ్రతపరాయణు లగుచు సామగానంబు సేయు విధంబును మఱియునుం గొందఱు నానావిధరహస్యమంత్ర ప్రకాశకంబగు నాథర్వణవేదంబు పఠించుచున్న వైఖరియును మఱియునుం గొందఱు శబ్దసంస్కారయుక్తంబు లగు వాక్యంబుల శబ్దశాస్త్రం బుపన్యసించు విధంబును మఱియునుం గొందఱు శ్రౌతకల్పవిధానంబు లగుచు యాగప్రయోగంబులు దెలుపుచందంబును మఱియునుం గొందఱు న్యాయవిచారపూర్వకంబుగా వేదవాక్యార్థంబు విచారంబు సేయుకౌశలంబును మఱియునుం గొందఱు తర్కవిద్యావిశారదు లగుచు గౌతమమతంబునం గల మోక్షతత్వంబు దెలుపు నైపుణ్యంబును మఱియునుం గొందఱు శాస్త్రప్రసంగంబుల యెడ స్వమతస్థాపనంబును బరమతాక్షేపంబును జేయుచు స్వమతపరమతసిద్ధాంతతత్త్వవిశారదులును బరమార్థ నిర్ణయంబు సేయువారును మఱియును గొందఱు శాస్త్రప్రసంగంబుల యెడ

వ్యాకరణంబును ఛందస్సును నిరుక్తియు జ్యోతిషంబునుం దెలిసి ద్రవ్యకర్మగుణంబులును గార్యకారణంబులు నెఱింగి జల్పవాదవితండాది ప్రసంగంబుల యెడల సంక్షేపవిస్తార రూపంబుల వ్యవహరించు నేర్పును మఱియునుం గొందఱాచార్యమతంబు నవలంబించి ప్రసంగంబు సేయు ప్రౌఢిమంబును గనుంగొనుచు మఱియునుం గొన్నియెడల దృఢవ్రతులును జితేంద్రియులును జపహోమపరాయణులును సిద్ధమంత్రులు నగు బ్రాహ్మణుల నవలోకించుచు నందందుఁ బుష్పసమన్వితంబుగా నమర్చియున్న యతిథిపూజార్థంబు లగు నాసనవిశేషంబులుం గాంచి యద్భుతంబుఁ జెందుచు దేవతాయతనంబుల బ్రాహ్మణులచేతఁ గల్పితంబు లగు పూజావిశేషంబులకు నలరుచు నేను బ్రహ్మలోకంబునకు వచ్చితిఁ గావలయు నని తలంచి యక్కాశ్యపమునీంద్రుని తపోమహత్త్వంబున సంరక్షితం బగు నయ్యాశ్రమవైభవంబు చూచి చూచి తృప్తి నొందజాలక యమాత్యపురోహిత సహితంబుగ నయ్యాశ్రమ సమీపంబున కరిగె.

అంత నమ్మహీరమణుండు నిజామాత్య పురోహితుల నంద యునిచి తా నొక్కరుండ కాశ్యపమునీంద్రునకు నమస్కరించు తలంపున నయ్యాశ్రమంబు ప్రవేశించి యచట నత్తపోధనాగ్రణిం గానక పేరెలుంగున నియ్యాశ్రమంబున నున్నవా రెవ్వ రని హెచ్చరించిన నయ్యెలుంగు విని మేఘమండలంబు వెలువడివచ్చు మెఱుపుగతి చందంబున సాక్షాత్క

రించిన మహాలక్ష్మియుం బోలిక రూపయౌవన సంపన్న యగు నొక్క కన్నియ పర్ణశాలాంతరంబు వెడలివచ్చి యభ్యాగతుం డగు నమ్మహారాజుం గనుంగొని విస్మయంబు నెంది కమలపత్రంబులఁ దెగడు నతని నేత్రంబులును విశాలం బగు వక్షస్థలంబును సింహస్కంధసదృశంబు లగు భుజ శిఖరంబులును నాజానుదీర్ఘంబు లగు భుజంబులును నితరదుర్ల భంబు లగు మహారాజ లక్షణంబులును దెప్పవేయక కనుం గొని మృదుమధురభాషణంబుల నతని కుశలం బడిగి సము చితంబగు పీఠంబున నునిచి యర్ఘ్యంబును బాద్యంబును నాచ మనంబును నొసంగి లజ్జావనతవదన యగుచు సముచిత ప్రకా రంబునం బ్రవేశించి యున్న యతనిం బూజించి నెమ్మొగం బున మందస్మితంబు నిగుడ నో మహానుభావ నీ వెవ్వండ వేనిమిత్తంబున నియ్యాశ్రమంబునకు వచ్చితి వేము సేయం దగిన కార్యం బెయ్యది యంతయు మా కెఱింగింపుమనిన నా రాజచంద్రుండు సకల శుభలక్షణసమన్వితయును సదా చారసంపన్నయు నగు నక్కన్నియం గనుంగొని యిట్లను నో రాజీవలోచనా యేను మహాత్ముం డగు నిలలుని కుమా రుండ దుష్యంతుఁడ ననువాఁడ ననిన నా శకుంతలయు సకల రాజపూజితుండ వగు నీకు మే మేమి యుపచరింపం గల వారము నా యిచ్చు కందమూలఫలోదకంబులు నీవు పరిగ్ర హించి మావలనం గావలయు కార్యంబు జరిగింపవలయు ననిన నా రాజశేఖరుండును శకుంతలతోడ నిట్లను. మహానుభావుం

డగు కణ్వమహామునీంద్రునకు వందనంబు సేయుటకు నిచ్చటికి వచ్చితి నమ్మహాత్ముం డిప్పు డెచ్చటనున్నవాఁ డెఱిఁగింపు మనిన శకుంతలయు మదీయజనకుం డగు కణ్వమునీంద్రుండు కందమూలంబులు దెచ్చుటకు నాశ్రమంబు వెడలి వనంబున కరిగియున్నవా డతండు వచ్చునంతకు ముహూర్తమాత్రంబు మీర లిచ్చటఁ బ్రతీక్షించియుంటి రేని యతని సందర్శింపఁగలుగు ననిన దుష్యంతుండు నమ్మహామునీంద్రుం డాశ్రమంబున లేకుండుటం జేసి శకుంతల యుపచరించు మధుర వాక్యంబులకు సంతసిల్లుచు రూపయౌవనసంపదల సొంపు మీఱు నవ్వారారోహం గనుంగొని నీ వెవ్వనికన్నియ విట్టి రూపగుణసమేత వగు నీవు తపోవనంబునకు రాఁ గారణం బెయ్యది! నిన్నుఁ గనుంగొనిన యంతన నామనంబు నీయందు సక్తంబై యున్నది. యే నొక్క రహస్యం బడిగెద దాఁచక యెఱింగింపవలయు నేను రాజర్షి యగు పూరువంశంబునం జనించినవాఁడ నామనంబు రాజకన్యకయెడంగాని కనుంగొన నొల్ల దట్టియ్యది నీయందు యిప్పుడు లగ్నంబై యున్న యది ఋషులకన్యలయందును నితర కన్యలయందును దవుల నొల్లని నాహృదయంబు నీయెడఁ దవులుటం జేసి నీ వవశ్యంబు క్షత్రియకన్య గావలయు నిన్ను వరింప నభిలషించుచున్న నన్నుం బరిగ్రహింపుము సముద్రపరివృతం బగు మహీతలం బంతయు నీవశం బయ్యెడు నీమనంబున వేఱొండు దలంపక నాదు పాణిగ్రహణంబున కంగీకరింప

వలయు ననిన నక్కన్యారత్నం బతనిం గనుంగొని మధుర భాషణంబుల నిట్లనె. సకల ధర్మజ్ఞుండును సకల లోకవిఖ్యాతుండును నగు కణ్వమునీంద్రున కేను పుత్రి నగుటం జేసి యే నస్వతంత్ర నిట్టి తలంపు గలిగెనేని నాగురుం డగు కాశ్యపమునీంద్రుని నడిగి కైకొనుట యుక్తం బగుం గాని యిట్లు వదరుట యుచితంబు గా దనిన దుష్యంతుం డునే నొక్క సంశయంబు నిన్నడిగెద భువనపూజితుండును మహానుభావుండును నగు కణ్వమునీంద్రుండు బ్రహ్మచర్యవ్రతుండు గావునఁ దనచిత్తంబు విడిచి ధర్మంబు చలించి నను దృఢవ్రతుం డగు నతండు చలింపంబోఁ డతని కెవ్విధంబునఁ గన్యయ వైతి విట్టిసంశయంబు దీర్పవలయుననిన శకుంతలయు నోరాజవర్యా యే నమ్మహర్షికిఁ బుత్రి నైనవిధంబు నీకెఱింగించెద విను మెవ్వం డేనియుఁ దనస్వరూపం బొకవిధంబున నుండ సత్పురుషులతోడ వేఱొండువిధంబునం దెలుపు నతం డాత్మాపహారకుం డగు చోరుం డనఁబడుగావున నిమ్మునీంద్రున కేను గన్యయ నైనచందంబునకు సత్యంబుగ వివరించెద విను మొక్కనాఁ డొక్క మునీంద్రుండు వచ్చి నీ వడిగి నట్ల యడిగినఁ గణ్వమునీంద్రుం డేను వినుచుండ నతని కిట్లనియె. నాకుఁ బరమమిత్రుం డగు విశ్వామిత్రుండు ఘోర తపంబు గావించుచుండ నతని తపోమహత్త్వంబునఁ దనదు రాజ్యం బతం డపహరించునో యను తలంపున నింద్రుండు భయంపడి మేనకయను నప్సరంబిలిచి [యతని తపోభంగము గావించి రమ్మనిబంపిన నదియును విపుల తేజోవిరాజమానుం

డును నత్యుగ్రతపోధనుండును గ్రోధశీలుండును నగు నమ్ము
నీంద్రుని నెట్టకేలకుఁ దఱిసి మధురసంభాషణంబుల నతని
చిత్తంబు కలంచి తపోవిఘ్నంబు సేసి బహువత్సరంబు లతని
తోడవసియించి యిక్కన్నియంగని మగుడ స్వర్గలోకంబునకుఁ
జనియె.] అటు చనునప్పు డిక్కన్నియ హిమవత్పర్వత సమీ
పంబునం దనరు మాలినీతీరంబునఁ బొత్తులలోన నునిచి సర్వా
భరణభూషితం గావించి యక్కన్నియం గనుంగొని నీవు
తపఃప్రభావుండగు కౌశికునికుమారితవు నీ కేమియుం గొఱంత
రానేరదు దేవకార్యార్థంబుగ నేనిటకు వచ్చితి మగుడ స్వర్గం
బునకుం బోయెద నని యక్కన్నియం దొఱంగి సురకా
ర్యంబు నిర్వహించిన యతిశయంబు దలంచుచు నింద్రుని
సభాభవనంబున కరిగె.

అంత సింహశార్దూలనిషేవితం బగునట్టి మహారణ్యం
బునఁ బొత్తుపయిం బడియున్న యక్కనియం గనుంగొని
యవ్వనంబున నున్న శకుంతంబులు దుష్టమృగములు దీని
బాధింపకుండవలయునని యక్కన్నియ నొరులకుం దెలియఁ
బడకుండునట్టు పరివేష్టించి పాలించుచుండె నాసమయంబున
నేను స్నానార్థంబుగ మాలినీతీరంబున కరిగితి నాశకుంతం
బులు తన పదంబులకుం బ్రణమిల్లి మధురభాషణంబుల
నోమహానుభావ యిక్కన్నియ కౌశికమునీంద్రుని కూఁతురు.
నీసఖుండగు నతండు కామక్రోధంబుల జయింపంజాలక తపంబు
గోలుపడి చనియె. నీవు సకల భూతదయాపరుండ వగుట నీ

శిశువుఁ బోషింపవలయు ననిన సకల జంతుసంభాషణంబుల నెఱింగియుండుదుం గావున నాశకుంతంబులపలుకు లంగీకరించి యిక్కన్నియ నీయాశ్రమంబునకుం దెచ్చి కూఁతుగని భావించుచు శరీరంబు గలిగించువాఁడును బ్రాణంబులు నిలుపువాఁడును నన్నంబు నిచ్చువాఁడును ధర్మశాస్త్రంబున నిమ్మువ్వురు పితృసమాను లగుటంజేసి నేను నిది కూఁతురనియు నిదియును దనదు జన్మప్రకారంబు తెలియమిఁ దండ్రియని యెంచుచున్నయది. నిర్జనంబగు వనంబునఁ దొలుత నిక్కన్నియ శకుంతంబులచేత రక్షింపఁబడుటంజేసి శకుంతలా నామధేయంబు కల్పించిరని కణ్వమునీంద్రుండు దెలియంబలుక వింటి. నావిన్న తెఱంగు నీకు వివరించితి ననియె.

అమ్మహీకాంతుండును మిగులసంతసిల్లి యోరాజపుత్రి యేనవిన తెఱంగున నీపలుకుఁబడిన నీవు క్షత్రియకన్యవగుట నిజంబయ్యె నామనంబు నీయెడం దవిలియున్నది. నాకు భార్యవగుచు నామనోరథంబు సఫలంబుసేయుము నీ కోరినట్లు నడపించెద. సరిపెనలు దివ్యాంబరంబులు పంజులకమ్మలు ననర్ఘంబు లగురత్నహారంబులును గంధసరంబులు నివియునుం గాక నీవభిలషించిన తెఱంగున సమస్తవస్తుజాతంబు లు నీకొసంగెద మదీయరాజ్యంబు సకలంబును నీయధీనంబు గావించెద నెల్లవివాహంబులందును గాంధర్వవివాహంబు ముఖ్యం బనం బడునట్టి గాంధర్వంబున నన్నుం బరిణయంబు గావలయు ననిన శకుంతలయు నమ్మహారాజు నవలోకించి తపోనిధియగు కణ్వమునీంద్రుండు కందమూలంబులు దెచ్చుటకు వనంబున

కరిగియున్నవాఁ డతండు వచ్చుదనుక ముహూర్తమాత్రంబు నిలువనోపు దేని యతండు నీకె యొసంగువాఁడు. కన్నియనగు తనకుఁ దండ్రియు దైవతంబును గురుండును నగుంగావున నా తండు నన్నెవరికి నొసంగు నతండు తనకు భర్త యగు నిది యెట్లంటేని జనంబులకు బాల్యంబునఁ దండ్రియు యౌవనంబున భర్తయును వార్ధకంబునఁ బుత్త్రుఁడును రక్షకులై యుందురు గావున స్త్రీజనంబునకు స్వతంత్రవృత్తి యెన్నండుఁ గలుగఁజాలదు దట్టి తండ్రి యనుమతంబు లేక సకల ధర్మజ్ఞుఁడ వగు నిన్ను, ధర్మంబుదప్పి యెవ్విధంబునఁ వరించుదాన ననిన సమ్మానవేంద్రుండు నివ్విధంబున బలుకుట మేరగా దేమిటి కంటేని తపఃప్రధానుండును దయాపరుండును నగు నమ్మునీంద్రుండు మన సమాగమంబున కేల యంగీకరింపకుండు? అగ్ని తన తేజోవిశేషంబునను సూర్యుండు కిరణంబులను మహీపాలుండు దండప్రయోగంబున నింద్రుండు వజ్రాయుధంబునను దహించునట్లు బ్రాహ్మణుండు కోపంబున దహింపఁజాలు నని యెఱుంగుదు నయ్యుఁ గాశ్యపమునీంద్రుం డివ్విధంబునకుఁ గోపింపఁ డని తలంచెద. నా హృదయంబు నీయందు దవిలి యున్నయది తన శరీరంబునకుఁ దానె బంధుండును దనకుఁ దానగతియును దనకుఁ దాన మిత్త్రుండును దనకుఁ దానె తండ్రియుంబోలె హితకరుండు గావునఁ దన్నుఁ దాన దానంబుసేయుట ధర్మంబు కావున నీమనంబున నిశ్చయించి నిన్ను నీవె యొసంగుట యుచితంబగు బ్రాహ్మ్యంబును దైవంబును నార్షంబును బ్రాజాపత్యంబును నాసురంబును

గాంధర్వంబును రాక్షసంబును బైశాచంబు లన వివాహంబు లెనిమిదివిధంబులం దనరునని స్వాయంభువుం డగు మనువు పలికియున్నవాఁ డవ్వివాహంబులలోనఁ గ్రమంబుగ నాలుగు వివాహంబులు బ్రాహ్మణులకుఁ బ్రశస్తంబై యుండు. క్షత్రియులకు నీక్రమంబున నాలువివాహంబులు ప్రశస్తంబులయి యుండు. రాజులకు రాక్షస వివాహంబును నట్లయుచితం బనంబడు వైశ్య శూద్రుల కాసురంబును యుక్తంబగు. బ్రాహ్మాదిబ్రాహ్మణవివాహంబులలో నొక్కటియును గాంధర్వ రాక్షసంబను వివాహంబులు రెండునుంగూడ మూడువివాహంబు లేనియు, బ్రాహ్మణవివాహంబులలో నొకటియు గాంధర్వంబునుంగూడ రెండువివాహంబు లేనియు క్షత్రియులకు ధర్మయుక్తంబు లనంబడుఁగాని పైశాచంబును నాసురంబును నంగీకరింపంజనదు. ఇవ్విధంబున సనాతనధర్మంబులును క్షత్రియవిహితంబులును నగు గాంధర్వరాక్షసంబుల సంశయింపవలవ దీ రెండువివాహంబుల వేఱువేఱ నేనియుఁ నొక్కుమ్మడి నేనియుఁ జేయఁజనుఁగావున ని న్నభిలషించుచున్న న న్నంగీకరించి గాంధర్వవివాహంబున భార్యవు గావలయుననిన నా శకుంతలయు నవ్విధంబున ధర్మమార్గంబగునేని న న్నొసంగుటకు నేనె తగుదునేని యొక్కసంకేతంబు సేసెద వినుమవ్విధంబునకు నీ వొడంబడితేని నీతోడం గ్రీడించుటకు సమ్మతించెద సత్యంబుగాఁ బ్రతిజ్ఞసేయు మది యెట్టిదంటేని వినుము. నాయందు జనియించిన కుమారుండు యువరాజు గావలయు నీ యనంతరంబు రాజ్యంబున కతండ రాజు కావ

లయు నిత్తెఱంగున కభిమతం బగునేని నీతోడ వివాహంబు సేయుదాన ననిన నక్కన్నియ పలుకు లాలకించి దుష్యంతుండు నీ తలంచినట్లు కావించువాఁడ నీ మనంబునం గల యభీష్టంబులన్నియుం జెలుపుమనిన శకుంతలయు నమ్మహీవల్లభుం జూచి లోకంబున గాంధర్వవివాహంబు ముఖ్యం బగునట్లయినను లోకాపవాదంబు పరిహరించుటకును సత్పుత్త్రలాభంబునకుంగా వివాహకర్మంబు నెరనేర్పవలయు యజ్ఞపాత్రంబులును గుశలును బుష్పంబులు నక్షతంబులు వాజ్యంబులును లాజలును మొదలుగాఁగలశోభనవస్తుజాతంబు లున్నయవి నీవు పురోహితునిం బిలిపింపుము. వివాహకర్మం బెత్తెఱంగున సాంగం బగు నత్తెఱంగున నీ కుమారుండును సకలలక్షణసమేతుం డగునని తలంచి నీతోడ నింత సెప్పంగవలసె నక్కుమారుండును రాజ్యంబు సేయవలయునను తలంపున నిన్నోడంబఱచిన నా గర్వభావంబులు క్షమింపవలయు ననిన నన్నరేంద్రుండును ముందు విచారింపక నీ వెట్లు చెప్పి తట్ల సేయంగలవాఁడనని తన పురోహితుం బిలిచి యీ రాజపుత్త్రి యెవ్విధంబునం బలుకనున్నయది యవ్విధంబున సమస్తంబు నాయితంబు గావింపుము దీని యెడం గలుగు కుమారుండు మహానుభావుండు గావలయుఁ దామసంబు సేయకు మనిన నప్పురోహితుఁడు నట్లయగుంగాక యని యతనికిఁ గంకణంబు గట్టించి శాస్త్రమార్గంబున వివాహంబు సేయించిన నమ్మహీపాలుండును నక్కన్నియం బాణిగ్రహణంబు సేసి దానితోడ నభీష్టభోగంబు లనుభవించి మగుడ నగరంబు

నకుం జనవలయునను తలంపున నా శకుంతలం జూచి యేను పట్టణంబునకుం జని చతురంగబలంబులును వేదశాస్త్ర విశారదు లగు విప్రపుంగవులను వనితాజనంబులను వేత్రధరులను సూతమాగధులను శంఖదుందుభిప్రముఖంబు లగు మహావాద్యంబులతోడ శిబికాసహస్రంబునుం బనిచి నిన్ను నగరంబునకు రప్పించెద నంతపర్యంతంబునకు నీవిచ్చటనేయుండు మయ్యర్థంబునందు నీవు సంశయింపవలదని గాఢంబుగం గౌఁగిటం బొదివిన నయ్యంగనయు నమ్మహారాజునకుఁ బ్రదక్షిణంబు గావించి మందస్మితంబు వదనారవిందంబునం దళుకొత్త నెదుట నిలిచి పదంబుల వ్రాలి కన్నీరు దొరుగ నిలిచిన నమ్మహీరమణుండు దాని తన భుజంబుల నొత్తుచు నింతయేమిటికి నీ మనంబునం బరితపించెదవు నాసుకృతంబు సాక్షి యగునట్లు నిన్ను నవశ్యంబునుం బట్టణంబునకుం బిలిపించెదనని దాని నచ్చటనె నిలిపి యుగ్రతపఃప్రభావుం డగు కణ్వమునీంద్రుం డివ్విధంబు విని యేమి గావించునో యని సంశయించుచు నతని సందర్శించి రానైతి నని చింతించుచు నిజనగరంబున కరిగె నంత నక్కడ నొక్క ముహూర్తమాత్రంబునకుఁ గణ్వమహామునీంద్రుండు నిజాశ్రమంబునకు వచ్చిన శకుంతలయు నిజజనకుం డగు కణ్వమునీంద్రునకు నెదురుగాఁ జనుటకు లజ్జాభయంబులం గొంకుచు నొక్కవిధంబున నతని నెదుర్కొని యమ్మునీంద్రుండు దెచ్చిన భారంబు డించి పీఠంబు సమర్పించి సుఖోపవిష్టుండగు నతని పాదంబులు గడిగి లజ్జాభరంబునం దలయెత్తి చూడనోడుచుఁ

దనదు బ్రహ్మచర్యవ్రతంబునకుం భంగంబు వచ్చుటం జేసి స్వధర్మపరిత్యాగంబునకు వడంకుచు మాటలాడ వెఱచి యున్న శకుంతలం గనుంగొని నీయున్న యునికి గనుంగొనిన వింతయై యున్నయది యేమి నీయం దొక్క యద్భుతంబు నడవనోపు నీ మనంబున భయంబు దక్కి నడిచిన తెఱం గెఱింగింపు మనిన నట్లు విన్నవించెద మీర లిపుడు కంద మూలఫలంబు లుపయోగింపుఁ డని యతనికి వలయువిధం బుల నాహారంబు లొసంగి తృప్తినిం జేసి విశ్రాంతుఁ డగునతని పాదంబులు తనయంకతలంబున నిడికొని పూరువంశవర్ధనుం డును దనకుఁ బతియును నగుదుష్యంతమహీకాంతుని మనంబు నం దలంచుచు లజ్జాభరంబునఁ గొంకుచు గద్గదభాషణంబుల నిట్లనియె. రేపకడ మీర లాశ్రమంబు నిర్గమించి ఫలమూలం బులకు వనంబున కేఁగినసమయంబున నిలలాత్మజుం డగు దుష్యంతుం డిచ్చటికి వచ్చె నమ్మహీపాలుండును దైవయోగం బున నిచ్చటికి వచ్చుటం జేసి యాతని మున్నె వరించితిఁ గావున నటమీఁద నడచిన వృత్తాంతంబు మీ దివ్యజ్ఞానం బునఁ దెలిసియుం డితండు మీ యల్లుం డగుటం జేసి యతని వంశంబునకు నభయం బొసంగుచుఁ బ్రసన్నులరు గావలయు ననిన నమ్మహానుభావుండును దనదివ్యజ్ఞానంబున నంతయు నెఱింగి నడచినవిధంబు ధర్మానుకూలంబగుటను దనదుపుత్రి హృదయంబు ధర్మంబుననుసరించి యుండుటం జేసిసంతుష్టహృ దయుండగుచుశకుంతలంగనుంగొని యేనునీనడచినవృత్తాంతం బెల్లదివ్యదృష్టి నెఱింగితి రాజపుత్రి వగునీవునాయనుమతంబు

లేకయుండియు రాజసమాగమంబు గావించుట ధర్మవిరుద్ధంబుగా దుచితం బగుకార్యంబు సేయుటంజేసి నీకు భయశోకంబులు సెందంబనిలేదు. క్షత్రియులకు గాంధర్వం బగువివాహంబు యుక్తంబె యగుఁ బరస్పరానురాగంబులు గల స్త్రీపురుషులకు మంత్రంబు లేకయుండినను గాంధర్వవివాహంబు దోషావహంబు గాదు. శాస్త్రోక్తప్రకారంబుగ నడచిన యీ మంత్రపూర్వక వివాహంబునకుఁ గోపింపం బని యేమి? పౌరవవంశవర్ధనుండగుదుష్యంతమహీకాంతుండు ధర్మశీలుండు పురుషవర్యుఁ డనంబడు నట్టి మహాపురుషునితోడి భార్యాత్వంబు నీకు లభించుటం జేసి చతుస్సముద్రముద్రితం బగు భూమండలంబు నేలంజాలెడు యశోవిశాలుం డగు కుమారుండు నీయందు జనియింపంగలవాఁ డక్కుమారుండు నిజభుజాబలంబున నెట్టి శాత్రవులమీఁద నడచిన నందందు విజయంబు గలుగంగల యది. విశేషించియు నిన్ను నుద్దేశించి యతనియెడం బ్రసన్నుండనైతి నీవలన నధర్మంబు లేదు. నీ కెయ్యది యభీష్టంబు దాని నొసంగెద వేఁడు మనిన శకుంతలయు నోయయ్య యేను బురుషవర్యుం డగు దుష్యంతమహీకాంతుని దేవతాసమక్షంబున వరించితిం గావున మంత్రిభృత్యసహితుం డగు నమ్మహానుభావునకు మీరలు ప్రసన్నులు గావలయు నతని. మనంబును ధర్మమార్గం బెపుడుక యుండవలయు నతని ప్రభుత్వం బప్రతిహతంబు గావలయు నతని వంశంబున జనించినవారలును శాశ్వతంబుగ రాజ్యపరిపాలనంబు సేయువారలె కావలయును నిట్టి వరంబులు

నాకు దయసేయవలయు ననిన సకల ధర్మవిశారదుండగు కణ్వమునీంద్రుండు నీవడిగినట్లు వరంబొసంగితినని దాని నెమ్మొము తన కరంబున నిమురుచు నేడు మొదలు నీవు మహానుభావుండగు దుష్యంతునికి భార్య వగుటం జేసి పతివ్రతాధర్మంబు పరిపాలింపు మని దాని శరీరంబు పావనం బగుటకు మఱియుం దాని నెమ్మొము కరతలంబున స్పృశించె. నాశకుంతలయు దానిం జేసి పరమహర్షంబునం బొదలె.

అంత దుష్యంత కరగ్రహణంబునం జేసి శకుంతలకు గర్భంబు కలిగి నానాంట నభివృద్ధంబు గాందొడంగె నట్లు శకుంతలయు దుష్యంత మహీకాంతుండు తనతోడ నాసతిచ్చినవిధంబునఁ జతురంగబలసమేతంబుగ బ్రాహ్మణులును స్త్రీజనంబులును నేఁడు వచ్చెదరు రేపు వచ్చెదరు మఱునాటికేనియు నవశ్యంబు వత్తు రని మొదరు చూచుచు దినంబులు పక్షంబులు మాసంబులు ఋతువులు నయనంబులఁ జూచి చూచి వేసరి యంత స్నానభోజనంబులు నిద్రయునుం దొఱంగి సంవత్సరత్రయంబు గడపినఁ గాశ్యపునియనుమతంబున ఋషిపత్నులు శకుంతలం జేరి యుక్తియుక్తంబు లగు వచనంబుల నిట్లనిరి. ఓశకుంతల లోకంబున నడచు తెఱంగు నీకెఱింగించెద మవ్విధంబు విని మనంబునకు రుచించునట్లు హితం బాచరింపుము. మీయయ్య యగు కాశ్యపమునీంద్రుండు నీకుం బ్రసూతికాలం బగుటఁ గుమారునిం గనుమని దీవించుచున్న వాఁ డతని వచనంబునఁ గుమారుం గాంచి తేని

దాన నీకు మేలయ్యెడు ననిన నాఋషిపత్నుల వచనంబు లాకర్ణించి శకుంతలయు నట్ల యగుం గాక యని సంవత్సర త్రయానంతరంబునఁ గుమారునిం గనియె నతండు జనించిన సమయంబున నంతరిక్షంబున బుష్పవర్షంబులు గురిసె. బహు విధంబులగు దేవదుందుభులు మ్రోసె నప్సరోగణంబుల నృత్తంబు నభంబునం జెలంగె. భువనమనోహరంబుగా గంధర్వులు గానంబు సేసిరి. దేవగణంబు నభస్థలంబున "సకల రాజలోకంబు నతిశయించుచు నశ్వమేధశతంబు నాచరింప సమర్థుండగు మఱియును సంపూర్ణ దక్షిణాసమేతంబులుగ రాజసూయాదిమహాధ్వరంబు లాచరించి భూసురుల నెల్లఁ బరిపాలింపనోపు" నని పలికిన నయ్యింద్రాదివచనంబు లాలకించి కణ్వాశ్రమనివాసులగు మహర్షులందఱును శకుంతల మిగులం బూజించిరి. శకుంతలయు నట్టి దేవతావచనంబు లాకర్ణించి మనంబున నెంతేనియు సంతసిల్లె. కణ్వమునీంద్రుండును నచ్చటం గల మునిజనంబుల రావించి యక్కుమారునకు జాతకర్మాదిక్రియలు యథాశాస్త్రంబుగ నొనర్చె. అట్లు సంస్కారసంపన్నుం డైన యక్కుమారుండును మొనలు గలిగి శుభ్రంబులుగ వెలింగెడు పలువరుసలం దనరుచు శరీర సౌందర్యంబును జక్రరేఖాంకితహస్తంబులునుం గలిగి రెండవ విష్ణుదేవుండుఁ బోలె వెలయుచు మహనీయ తేజోబలంబును శుభలక్షణం బగు శిరంబును నాలుగు మూరల ప్రమాణంబు గల దేహంబును గలిగి దేవకుమారసదృశుం డగుచు నయ్యాశ్రమంబున నానాఁట నభివృద్ధిం జెందుచుండె. అంత దుష్యం

తుండును దా నాచరించిన కార్యంబునకుఁ గణ్వమునీంద్రుం డలిగి శపించునో యను తలంపున శకుంతలమీఁద ననురాగంబు గలిగియు నగరంబునకుం బిలువనంప వెఱచియుండె. అంతఁ గొంతకాలం బరుగుటయు బహుకార్యసక్తుం డగుట నీ వృత్తాంతంబు మఱచి రాజ్యంబు సేయుచుండె నంతఁ గణ్వాశ్రమంబునం బెరుగుచున్న శకుంతల కుమారుం డాఱు సంవత్సరమ్ముల ప్రాయంబువాఁ డగుచుఁ గణ్వాశ్రమసమీపంబునజనంబులఁ వెంబడించుచున్న వ్యాఘ్రసింహవరాహంబులను దోర్దండ్డను గాఱెనుఁబోతులను నెలుగులను మఱియునుం గలక్రూరజంతువులను నిజభుజాబలంబున బంధించి వానిపయిఁ దన చాతుర్యంబు మెఱయ నెక్కి పసవు లెత్తించుచు వేడెంబులు ద్రిప్పుచు ఘోరం బగు వనంబెల్ల నిట్టట్టు గావించుచు నంతఁబోక యాశ్రమంబున కుపద్రవంబు సేయం దొడంగు పిశాచగణంబుల రాక్షసులఁ దన ముష్టిప్రహారంబులం గెడిపి మునిజనంబుల మనంబులకు సంతోషంబు గల్పించుచుండు సమయంబున గొంతకాలంబునకు మహాబలసమన్వితుం డగుచు నొక్క దైత్యుం డీతండు రాక్షసుల నెల్ల సమయించువాఁడు గావున నికుమారుని సమయింపవలయు నను తలంపునఁ గడంగినఁ దన బాహుబలమున నతని బిగియంబట్టి యట్టహాసపూర్వకంబుగా నదిమిన నద్దైత్యుండు పట్టు విడిపించుకొనఁజాలక మిగుల నొచ్చి వికృతస్వరంబునఁ బేరెలుంగున మొరలువెట్టుచు నోట, ముక్కునఁ గర్ణరంధ్రంబుల నెత్తు

కులు గ్రక్కె. వాని పేరెలుంగునకు సింహశార్దూలాది ఘోర
మృగంబులు పురీషమూత్రంబులు విడుచుచు నలుదెసలఁ బర
వందొడంగె నంత నక్కుమారుండును జానుప్రహారంబుల
వాని సమయించి విడిచిన నక్కుమారుని విక్రమంబునకు
నయ్యాశ్రమంబునం గల మహర్షులు మిగుల నద్భుతంబు నొంది
రివ్విధంబున... సకలదుష్టజంతువుల దమయించుటం జేసి
యక్కుమారునకుఁ గణ్వాదులగు మునీంద్రులు సర్వదమనుం
డను నామధేయం బొసంగిరి. అంత శకుంతలయుఁ దన విభుం
డగు దుష్యంతుండు పుత్రసమేత యగు తన్నుఁ బిలువనంపమిం
జేసి వెలుకఁబాఱిన శరీరంబును దొలంగఁ ద్రోయమిం జేసి
లలాటంబున వ్రేలు ముంగురులును నానాఁట నగ్గలం బగు
కార్శ్యంబును మలినంబు లగు వస్త్రంబులును మొగంబునం
బ్రకాశంబగు దైన్యంబును గలిగి చింతాపరవశత్వంబున నుండు
టయు సర్వదమనుండు పండ్రెండు సంవత్సరముల ప్రాయము
నం దనరుచు వేదశాస్త్రంబు లధికరించి యతిమానుషప్రభా
వంబున నెఱసి యౌవరాజ్యమునకు యోగ్యుండై యుండుట
యును గని కణ్వమునీంద్రుండు శకుంతలం బిలిచి లోకంబు
నందు మనోవాక్కాయకర్మంబులఁ బతిశుశ్రూషణంబె పతి
వ్రత యగు స్త్రీకిఁ బ్రశస్తంబు గావున నా యనుమతంబున
నీ విభుం డగు దుష్యంతుని సమీపంబున కరిగి యతనిఁ
బూజించుటయె నీ కుచితధర్మంబగు నివ్విధంబునఁ బాతి
వ్రత్యధర్మంబున నడచితేని యుత్తమలోకంబు చెంది పుణ్యావ
సానంబున మఱియు మనుష్యలోకంబున నుత్తమ జన్మంబు·

పెంది సకలభాగ్యసమన్విత వగుచు విలసిల్లెదవు గావునఁ బౌరవవంశవర్ధనుం డగు దుష్యంతుని సమీపంబున కరుగు ముతెంచు నింతకాలంబు నిన్నుఁ బిలువనంపింపఁ డయ్యె నని మనంబునం దలంపక నీకు హితంబగు తెఱంగున నమ్మహా విభుని పాలికిం జని యతని చిత్తంబు వచ్చునట్లుగా నారాధింపు మతండు నీ వలన సంతుష్టుండగుచు నీ కుమారునకు యౌవరాజ్యం బొసంగువాఁడు. దాన నీ కెంతేయు సంతోషంబు గాఁగలదు. కావున నీకుమారునిం దోడ్కొని నీ విభునిపాలికిం జను మివ్విధంబునకు నొడంబడక ప్రత్యక్షవేని నాదుపదంబులకుఁ దప్పినదాన వగుదువని యాన తిచ్చి యక్కుమారుసం బిలిచి గాఢాలింగనంబు సేసి శిరంబు మూర్కొని కుమారకా చంద్రవంశసముద్భవుం డగు దుష్యంతుం డను మహీవిభుండు నీ జనకుండు. నీ జనని యతని పట్టమహిషియని తెలియుంగు మిదయుఁ దనపతి సమీపంబున కరుగఁదలంచి యున్నయది. తల్లివెంబడిం జని నీ జనకునకు నభివాదనంబు సేసి యతనివలన యువరాజ్యంబు వడయు మతండును నీ వలనం బ్రీతుండగు. కులక్రమాగతం బగు రాజ్యంబు ననుభవింపు మట్లు సామ్రాజ్యంబున నుండునప్పుడు మమ్ము మఱవకుండుమని యానతిచ్చిన నక్కుమారుండు నమ్మునీంద్రుని పదంబులకు నభివాదనంబు సేసి "యో మహానుభావా తల్లియుఁ దండ్రియుఁ బ్రాప్యంబును నీవ యని యున్నవాఁడ గాని యితరం బెఱుంగ నీ శుశ్రూషణంబునం జేసి యిహపరంబులు సాధింతునని యున్నవాఁడ. నీ శకుంతల

భర్తృశుశ్రూషణంబునకుం బోవలయు నను తలంపు గలదేని యథేష్టంబుగఁ జనుంగావుత. ఏను మీ పాదంబులకు శుశ్రూష గావించుచు నిచ్చటనె యుండువాఁడ. ఇందుఁ గల మృగంబుల హింసించుచున్నవాఁ డను తలంపు నీ మనంబునం గలదేని నేఁడు మొదలట్టి క్రీడకుం జొరక యధ్యయనపరుండనై మీ యాజ్ఞలోఁ మెలంగుచు మీ సన్నిధానంబుననుండువాఁడ" నని యతని పాదంబులుం బట్టుకొని విడువక యుండిన సక్కుమారుని వచనంబు లాలకించి పితృస్నేహంబునం బుత్రవాత్సల్యంబునం బొడము హర్షశోకావేశంబునఁ గన్నీరు ధారాళంబుగా నించుచున్న తన జననిం గనుంగొని యక్కుమారుండు,ఏల కన్నీరు నించెదవు, నీకుఁ బతిభక్తి గలదేని ప్రాతఃకాలంబునం గదలి పట్టణంబునకుఁ జను మనిన శకుంతలయు నే నెంతయు వలదని వారించినను వినక యిక్వనంబునం గల మదగజంబుల సింహశార్దూలంబుల మఱియునుం గల నానామృగంబులం బట్టి బాధింపం దొడంగితి విట్టి చరిత్రంబులు నివారించుటకుం జేసి యిమ్మహానుభావుం డగు కణ్వుండు మన యెడం గనలి యాశ్రమంబు వెడలనంపుచున్నవాఁ డొక్కరుండు పాపంబుచేసిన నప్పాపఫలం బతని బంధుజనంబు లంద ఱనుభవింతురను తెఱంగున నీ దుడుకుఁదనంబునం జేసి నాకీ యాశ్రమంబు విడువవలసె నని కన్నీరు ధారాళంబుగ నించుచు నమ్మునీంద్రుని చరణారవిందంబులం బడి లేవకున్న నక్కాశ్యపుండును హేతుగర్భితం బగు నావచనం బాలింపుము. వనితాజనంబులకుఁ బాతివ్రత్యధర్మం

బులు విడిచిన సాధింపగలకార్యంబు లేమియున్నయవి? పాతి
వ్రత్యధర్మంబునకు మెచ్చి సమస్తదేవతలు నభీష్టఫలంబుల
నొసంగి యాపన్నత్రాణంబు గావింతురు. పతిప్రసాదంబునం
జేసిసమస్తపుణ్యలోకంబులుం గలుగుఁ గావున నీవిపుడ రాజ
నగరంబున కరిగి యమ్మహారాజు చిత్తంబు రానడుపుము
యక్కుమారుతోడం బలికి సర్వదమనుం గనుంగొని నీవు
మాకు దౌహిత్రుండవు. ఇలలుండును మహాత్మునకుం బాత్రుండ.
నేను నీకు హితంబు పలికెద. మద్వచనంబు సత్యంబుగాఁ
దలంపుము. నీతల్లి యగు శకుంతల మనంబునఁ దనవిభునియం
దనురాగము గలిగియున్న విధంబు తెలియంబడకుండునట్లు
మాటలాడుచున్నయది. ఇట్టి శకుంతలం దోడ్కొని నీవ
వశ్యంబు నిమ్మునులతోడంగూడ నగరంబున కరుగసము
ర్థుండ వని పలికి తనశిష్యులపేరులు పిలిచి సర్వలక్షణసమేత
యగు నీశకుంతలను బుత్రసమేతంబుగా రాజనగరంబునకుం
దోడికొనిపొండు. వనితాజనంబులు పితృగృహంబున బహు
కాలం బధివసించినఁ గీర్తిచారిత్రధర్మంబులం దొలంగుదురు.
గావునఁ దడవుసేయక కదలిపొండనిన శకుంతలయు దన
మనంబున నెంతేని సంతసిల్లె. అంత నక్కుమారుండుఁ
గణ్వమునీంద్రునకు నీవు మగుడి రావలసిన వచ్చెదవుగాక
యని పలుకుటకు సంతసిల్లుచుఁ దనజననిం గనుంగొని యేమి
టికిఁ దడవుసేసెద వని యమ్మునీంద్రుని పాదంబులకుం బ్రణ
మిల్లి పయనంబున కాయితం బగుటయు శకుంతలయుఁ దం
డ్రికిఁ బ్రదక్షిణంబు గావించి పాదంబులకు వందనంబు సేసి

కృతాంజలి యగుచు, నోమహానుభావా! తండ్రియనుచవుం జేసి యేను నేర్చి నేరక చేసినకార్యంబులను నెఱింగియు నెఱుంగకనాడినపలుకులను నాయెడంగలవాత్సల్యంబునక్షమింపవలయు ననిన నక్కుమారియెడం గల కృపావిశేషంబున మఱుమాట లాడక శిరంబు వంచుకొని సాధారణమనుష్యుని చందంబునం గన్నీరునించి కొంతతడవునకు ధైర్యంబవలంబించి యుదకపానంబుల దినంబులం గడపువారును, వాయుభక్షణంబున దివసంబులు ద్రోయువారును ఫలమూలంబులం దృప్తి నొందువారు నిందిర్దియంబుల జయించి యోగారూఢులై యుండువారును, వ్రతనిష్ఠులైయుండువారును, జటాధారులును, కృష్ణాజినోత్తరీయులు నగు ననేక మునీంద్రులం బిలిచి యో మహానుభావులారా! మనశకుంతల యిచ్చటనెపుట్టియిచ్చటనె పెరిగె. సతతంబు నేను లాలించుటంజేసి వేఱొండుతలంపెఱుంగకున్నయది కావున మార్గంబున శ్రమంబు దోచకుండున ట్లిచ్చటికి రెండుయోజనంబులకు నవలం గల ప్రతిష్ఠానగరంబునకు మృదుప్రయాణంబులందోడుకొనిపోవలయు. ఆనూపజాంగలయుతంబును ధనధాన్యపరిపూర్ణంబును నగుచు గంగా యమునా సంగమంబునందోచు నాప్రతిష్ఠానపురంబునందు మనసర్వదమనునకుం బూర్వపితామహుండగు పురూరవుం డూర్వశీసమేతుండగుచుం జిరకాలంబు రాజ్యముసేయుచుండె. మీ రాప్రదేశపర్యంతంబున కరిగి యచటంగృతస్నానులగుచు హోమంబు లాచరించి కందమూలంబులాహారంబుగాం

గాని యందుండి మీరలు మరలి రం డివ్విధంబునం గాక తీవ్రప్రయాణంబునఁ జనుదు రేని మార్గగమనంబునఁ బరిశ్రాంతు లగుదు రని యానతిచ్చిన నట్ల కాక యని శకుంతలను బుత్త్రసహితంబుగాఁ దోడ్కొని దుష్యంతనగరంబు నుద్దేశించి కదలి వనంబులు నదులు పర్వతంబులు సెలయేఱులు గుహలుఁ దరులు రాష్ట్రంబులు నగరంబులుఁ బుణ్యాశ్రమంబులుఁ గనుఁగొనుచు నందంద నిలుచుచుఁ గ్రమక్రమంబున మధ్యాహ్నసమయంబునకుఁ బ్రతిష్ఠాననగరంబునకువచ్చి రన్నగరంబు పూర్వంబునఁ బురుహూతుండు పూరువునకుంగా నిర్మించెఁ గావున సకలసౌఖ్యసౌభాగ్యసమేతంబును నత్యున్నతంబులగు నలంకరణంబులును నగాధంబు లగు నగడ్తలును విచిత్రంబులగు కొత్తళంబులును గల కోటలును శతఘ్నులును యంత్రవిశేషంబులును నుప్పరిగెలును సౌధంబులును బణ్యవీధులు రచ్చపట్టులును సభాస్థానంబులును జలపందిరులును సకలజనమనోహరంబులు నతివిశాలంబు లగు రాజమార్గంబులును గైలాసశిఖరంబులఁ బోలె నతిధవళంబులు నత్యున్నతంబులగు పురద్వారంబులును మేలిమిద్దెలునుం గలిగి స్వర్గనగరంబునం దనరుటకు సంతసిల్లుచు వారలు పురసమీపంబునం గల యుద్యానవనంబులను బద్మశోభితంబు లగు తటాకంబులఁ దమతమధర్మంబులు దప్పక యగ్నిహోత్రంబులు నధ్వరంబులు నాచరించుచు ధనధాన్యసమృద్ధులును రత్నాలంకారభూషితులును దానశీలులుదయాపరులు నగుచు

నకార్యంబులకుం జొరక పాపంబులకుం దలంకుచుఁ బుణ్య లోకంబులు వలయు నను తలంపున సదాచారంబులం దనరు నానాజనంబులం గనుంగొనుచు సంతసిల్లిరి. ఆసమయంబున దుష్యంతమహీకాంతుఁడు నింద్రలోకంబు ననుకరించు ప్రతిష్ఠాననగరంబున మధ్యప్రదేశంబున దివ్యరత్నమయంబగు మహేంద్రభవనంబు చందంబునం దనరు రాజమందిరంబున మణిగణఖచితంబగు నొక్క సభాభవనంబున నధివసించి సర్వాలంకారభూషితుం డగుచు బ్రాహ్మణప్రభృతు లగు సకలవర్ణంబులవారును మంత్రిజనంబులును మఱియునుఁ దగువారును సముచితప్రకారంబునం గొలువఁ గార్యార్థులగు వారికార్యంబు లమర్చుచు నిండుకొలువుండి తగుతెఱంగుల వారివారలగృహంబుల కనిచి మిత్రజనంబులతోడ నిష్టాలాపంబులం బ్రవర్తించుచుండె.

అంత నక్కడ మునీంద్రులు శకుంతలం గనుంగొని భూపకార్యసూచకంబు లాలకించి యోతల్లి నీకు ననేకశుభంబులుగాఁ గలయవి. తదనుగుణంబు లగునిమిత్తంబులంగాంచితిమి. నేఁ డీమ్మహారాజునకుఁ బట్టమహిషి గాఁగలదానవు. నీకుమారుండు యౌవరాజ్యంబున కభిషిక్తుండు గాఁగలవాఁడని పలుకుచు నాశకుంతలం దోడ్కొని వివిధతూర్యనినాదమేదురం బగుతత్పురద్వారంబు చొచ్చి వచ్చు నవసరంబున నక్కుమారుని రూపరేఖాతిశయంబులకుఁ బౌరజనంబులు విస్మయంబు నొందుచు నొండొరులం బిలుచుచు వారలం

జేరం జనుదెంచి రెండవమహాలక్ష్మిచందంబున జయంతిసహి
తయై వచ్చుచున్న పౌలోమి తెఱంగున నిక్కుమారునితోడ మునుల
ముంగల జనుచున్న యీయంగన యెవ్వతెయో యెఱుం
గుద మని యమ్మహర్షులం జేరంజని యోమహర్షులార మీ
కభివాదనంబు గావించెద మిట్టి పరమపావను లగు మిమ్ముం
గనుగొనుటంజేసి మాజన్మంబులు సఫలంబు లయ్యె. సూర్య
సమానను లగుమీయట్టి మహాత్ములం గనుగొనుటంజేసి
కృతార్థుల మైతిమని సన్నుతించిరి. కొందఱు వారల వెంబ
డించి పార్వతీకుమారుం డగుకుమారుని తెఱంగున నక్కు
మారునిం జూచుచు సంతసించిరి. సర్వదమనుండును దత్పు
రంబునం గలసౌభాగ్యాతిశయంబునకు విస్మయంబు నెందుచుం
దాను సురనగరంబునకు వచ్చితిమో యని తలంచుచుండె.
మఱియుం గొందఱు కృష్ణాజినంబుల ధరించి క్షుత్పిపాసాపీ
డితు లగుచుం దపఃకృశాంగులును గపిలవర్ణంబు లగునేత్రంబు
లును, చీరనరాలతోడం గనిపించుశరీరంబులుగలవారును, జడ
లును దీర్ఘంబులగు దంతంబులును గొప్ప లగు నుదరంబులును
గలిగి వికృతరూపవేషంబులతోడ నున్న యమ్మునీంద్రులం
గనుంగొని సంధ్యాసమయంబు గాకయుండియును బిశాచం
బులు మనపట్టణంబునకు వచ్చెం గంటిరే యని పరిహాసంబు
సేయందొడంగి రట్టి దుర్జనవచనంబు లాలకించి యమ్మునిజనం
బులు మన కేటికి నీనగరంబున కరుగవలయుం గణ్వమునివచన
ప్రకారంబున గంగా యమునాసంగమప్రదేశంబునందు నిలుత
మని యచ్చటికిం జనిరి.

అత్తఱింగున నమ్మునీంద్రులు తన్నుం బరిత్యజించి చనుటయు శకుంతలయుఁ దలిదండ్రుల విడిచి పరితపించుశిశువుపోలిక ఖేదంబు నెమ్మనంబునం గ్రమ్మకొని యున్నను ధైర్యం బవలంబించి యక్కుమారునితోడ రాజమార్గంబునఁ గ్రమక్రమంబున వచ్చుచుండె. పౌరవవంశవర్ధనుండగు నక్కుమారుండును దొలుత నెన్నండును గనుంగొని యెఱుంగని సౌధంబులును బ్రాసాదంబులును జైత్యంబులును నానావిధంబు లగు దివ్యసభాభవనంబులునుం జూచుచుఁ గుతూహలంబును నద్భుతంబునుం జెందె. మఱియు నప్పురజనంబు నా శకుంతలంగని సర్వాంగమనోహరయు, శుభలక్షణలక్షితయు నగునివ్వరారోహాస్వర్గంబుఁ బరిత్యజించి భూతలంబుఁ గనుంగొనఁ జనుదెంచిన దేవకన్యక గానోపునని తలంచి యక్కుమారునిం గనుంగొని రాజ్యలక్షణలక్షితుం డగునిక్కుమారునియందు రాజ్యలక్ష్మి గొల్చుచున్నయది. ఇబ్బాలకుం డాకారంబున రూపంబున శరీరంబునఁ దేజోవిశేషంబున మనదుష్యంతమహీపాలునిం బోలియున్నవాఁ డితఁ డెవ్వనికుమారుండో యెఱుంగమని వేలకొలందులు జనులు ప్రశంసింపం దొడంగిరి. మఱియు నప్పురంబునం గల సమస్త కాంతాజనంబులును నెనరు గల బంధుజనంబుఁ బోలిక నాశకుంతలవెంబడిం జనుదెంచి రాశకుంతలయు వారి నానావిధవాక్యంబు లాలకించుచు రాజభవనద్వారంబు చేరి కార్యగౌరవంబునఁ జింతాభారంబు నెమ్మనంబునం గ్రందుకొన లజ్జాభరంబున వదనంబు వంచి యే నెట్లు రాజస

న్నిధికిం జని నిర్నిమిత్తంబున దయావిహీనుండగు నతనితోడ నేమని యెఱింగించుదాన నని చింతించుచు హజారంబున నిలిచి తనరాక యెఱింగించి పనిచి యతని యనుమతంబునం దరుణపూర్వసమాన తేజుం డగుతన కుమారునితోడం రాజసమక్షంబునకరిగి రెండవసురేంద్రునిచందంబున సింహాసనంబున నున్న మహీపాలునిం గనుంగొని యెంతకాలంబున కిమ్మహీపాలునిం గనుంగొనంగలిగెనని సంతసిల్లుచుం గుమారు నతని కభివాదనంబు చేయం బనిచి లజ్జావనతవదన యగుచునొక్క కంబంబుచాటుగా నిలిచి యోమహారాజ! నాయెడంబ్రసన్నుండవగుచు మమ్ముం గటాక్షింపు మని పలికె. నక్కుమారుండును నిజజనకుండగు నమ్మహారాజున కభివాదనంబుచేసి కృతాంజలిపుటుం డగుచు హర్షవికసిత వదనారవిందుం డగు నతనిం గనుంగొనుచుండె. అంత దుష్యంతమహీకాంతుండును ధర్మపరుండు గావున శకుంతల నవలోకించి కుమారసహితంబుగ నీ వచ్చటికి వచ్చినకార్యం బెఱింగింపు మకార్యం బవశ్యంబు సంఘటించెద ననిన శకుంతలయు నమ్మహీపాలునిం జూచి యోమహానుభావ తొలుత నీవు మృగయావినోదార్థంబుగ వనంబునం దిరుగుచుం గణ్వాశ్రమంబునకు వచ్చిన సమయంబున నన్నుం బాణిగ్రహణంబు సేసినప్పు డేమని సంకేతంబు సేసితి వట్టిసంకేతం బిప్పుడు నీహృదయంబునం దలంచి యట్టిఅం గాచరింపు మితండు నీవలన నాయందు సంభవించిన కుమారుం డితని యౌవరాజ్యంబున కభిషిక్తుం జేయు

మనిన యప్పలుకులాలకించి యమ్మహీకాంతుండు దాని మఱచియుండియు నాశకుంతలపలుకులవలనఁ బూర్వవృత్తాంతంబు హృదయంబునం దలంచి యపారహర్షంబు సెంది తానెఱుంగనివాని చందంబు భావించుచు శకుంతలం జూచి నిన్నుఁ బాణిగ్రహణంబు సేయుట యెఱుంగ నిట్లుధర్మంబు దప్పి పరగృహీతంబగు కళత్రంబును బరిగ్రహించు వాఁడఁగా నిట్టి వృథాలాపంబులు పలుక కూరకుండుము. కాదేని నీకుఁ దోఁచిన తెఱంగునఁ జను మనిన యన్నరేంద్రుని వచనంబు లాకర్ణించి ధీరోదాత్తయగు శకుంతలయు మిగులలజ్జాభరంబు సెందుచు మనంబునం బొడముదుఃఖావేశంబున ముహూర్తమాత్రంబు మైమఱచినట్లు యుండి మిగుల ధైర్యంబు నవలంబించి క్రోధావేశంబునఁ గన్నులు జేవురింప నధరపల్లవంబు గంపింప నమ్మనుజవల్లభుని దొరచూపులం జూఱజూఱం జూచుచుఁ గోపవేగంబున విజృంభించుచున్న తపోజనితతేజో విశేషంబునుందన ధైర్యంబున నడంచుచుముహూర్తమాత్రంబు చింతాపరవశత్వంబుఁ జెంది మఱడ నతనిం గనుఁగొని నీతియుక్తంబు లగు వచనంబులు "నో మహీరమణ! నీ వెఱింగియు నెఱుంగనివాని చందంబున నేల యివ్విధంబునం బలికెదవు? నీదు సత్యంబునకు ననృతంబునకు గల్యాణకరంబును సాక్షిభూతంబు నగు నీ యాత్మ నే పనికి నవమన్నన చేసెదవు? ఏ పురుషుండైన సత్యవంతమైన తన యాత్మ ననృతంబునం బొందించు నాతండె యాత్మాపహారి యగు చోరుం డనంబ

రంగి సమస్తపాతకంబులు నాచరించిన వాఁడయగు. మఱి యును బాపంబు నాచరించునెడ నే నొక్కరుండనె కాని యన్యు లెవరు నెఱుంగ రని తలంచెదవు కాని హృత్కమల సన్నివిష్టుఁడై శాశ్వతుండును నై సకలశుభాశుభకర్మ సాక్షియగు పరబ్రహ్మ కనుంగొనుట తెలియక తత్సాన్నిధ్యంబున నెట్టి పాతకంబుల నాచరించెదవు? మఱియును సకలసాధుజనంబు నకు ధర్మంబు హితకారణం బయ్యును మిథ్యాభియుక్తులగు కుమతులకు దుఃఖకారణంబునై యుండు. అదియునుంగాక పాపాత్ముండగు పురుషుండు పాతకంబు లాచరించు నెడఁ దా నొక్కరుండునె కాని వే ఱెవ్వరు తెలియనేరరని యెంచు నింతె కాని సకలజగత్సాక్షు లగు దేవతలును నంతర్యామి యగు పరమపురుషోత్తమునిఁ జంద్రసూర్యుల నగ్ని వాయువుల భూమ్యాకాశముల జలంబుల హృదయాది దేవతలయమధర్మ రాజును దివా రాత్రుల సంధ్యాసమయంబుల ధర్మదేవతలసర్వ సాక్షులం దెలియంజాలక యాచరించు పాపంబునకుఁ దగిన దండన వైవస్వతుండుగావించుచుండు. అదియునుం గాక సకల జీవాంతర్యామి యగు పరమపురుషుండు మనయందు సత్కర్మంబు లాచరించునెడ సంతుష్టుఁ డగు. దుష్కర్మంబు లాచరించునెడఁ గటకటంబడి యహ్వాని నుపేక్షించు నట్టి పాతకుని యముండు తత్తత్కర్మానుకూలంబగు దండంబున దండించుం గనుక నోయి రాజకుమారకా సకలధర్మవేత్తవగు నీవి పలికి బొంకెదవు. మఱియును బతివ్రతనైన నన్నుఁ

గాముకురాలై తనంతట తానె వలచివచ్చిన దని యెంచ వలదు. బహుమానయోగ్యురాలనై భరింపఁదగినటువంటి నన్ను బహుమానంబు సేయక యుపేక్షింపఁదగదు. మహానుభావుండగు నీవు ప్రాకృతునింబోలిక నిండుసభకు నిట్టి తులువపలుకులు పలికితి వేనియు నావచనంబునాలకింపవేనియు వేఁడుకొను నన్నాదరింపవేనియు నోదుష్యంత, నీయుత్తమాంగంబు సద్యశ్శతవిభాగంబులు గాఁగలయది. అదియునుంగాక సుతుం డెవ్వనియందు జనించు నతని కూటస్థులగు పితృగణంబులఁ బున్నామనరకంబునం బడనీయక త్రాణయొనర్చు కతన సుతుండు పుత్త్రుండనంబరగె. పుత్త్రునివలనస్వర్గంబును బౌత్త్రునివలనమోక్షంబును జనకుండుపొందుచుండు. ప్రపౌత్త్రునివలనఁ బ్రపితామహాదులు పరమానంద పదస్థులగుదురు. అదియునుంగాక పతివ్రతయై గృహకృత్యంబుల నిర్వాహకురాలై తన పతినిఁదన ప్రాణంబులని యెంచదగినదై యుండు నది వానికి భార్య యనంబరఁగు. మనుజునకు భార్య యన స్వశరీరార్థభాగంబు నుత్తమసమపాత్రంబుననఁదెలియందగియుండు. మఱియును గృహస్థునకు ధర్మార్థకామంబులకును బాంధవ సమృద్ధికిని యాగాదిక్రియలకును సముస్తసంతోషంబులకును భార్యయె మూలంబు నగుచునుండు. ధనవంతునికి బంధుజనంబు ప్రియంవదులగుదురుకాని దారిద్ర్యకాలంబున భార్యపోలికఁ గ్లేశానుభవసహాయులు కానేరరు. మఱియును మహారణ్యంబున నొంటిమార్గంబు నడచు నతనికి సభార్యుండగు గృహస్థునింట నమ్మి నిలువందగుఁగాని యేకాకి యగు పురుషుండు

నమ్మఁదగఁడు. అట్లు గనుక భార్యావంతుం డగు పురుషుండు సకలజన విశ్వసనీయుండు. ఐహికాముష్మికముల యందును భార్య పతికిఁ గారణంబగు. పుత్త్రునిం గన్న జనకునకు నెమ్మనంబు స్వప్రతిబింబమ్మును దర్పణంబునఁ గనుంగొను నటుల నానందభరితం బగుచునుండు. మఱియును నెంతదుఃఖవ్యాధిపీడితు లగుమనుజులు స్వదారలం గనుఁగొనినంత దప్పిగొన్న వారలు స్వాదూదక పానంబులు దొరికినట్లు సంతుష్టాంతరంగు లగుదురు. ఎంతటియలుక వొడమినను వివేకు లగు పురుషులును స్వదారలం ధిక్కరించి పలుకరు. అటుగనుక సర్వదానిరతు లగుమహాపురుషులు వారలయం దుద్భవించిన తమ పుత్రుల నాలింగనంబు గావించినంతనె బ్రహ్మానందంబు నొందుదురు. అదియునుంగాక వాయసంబులు తమ గూళ్ళ కోకిలలిడిన యండజంబుల స్వకీయాండంబులతోడఁ బోషించుచున్నయవి. ఇట్టి వట్ల నినువంటిసర్వజ్ఞుని కిట్టి పుత్రరత్నంబు నుపేక్షింపందగునె? శీతలంబులయందు మలయజపంకం బతిశీతలం బండ్రు నదియుఁ బుత్రాలింగన ప్రాప్తశీలంబున కైన గానేరదు. మఱియు మృదుశయ్యాసన వస్త్రసంపదాదుల లబ్ధంబగు స్పర్శసౌఖ్యంబును బుత్రాలింగన ప్రాప్తసౌఖ్యంబున శతాంశంబుపోల దండ్రు. నీ పుత్రశ్రేష్ఠుండు వత్సరత్రయంబు గర్భంబున వసియించిజననంబునొందె. ఓ రాజశ్రేష్ఠా, దేవరకు సకలక్లేశాపహారుండగు నిప్పుత్రరత్నం బవతరించినతఱి నశరీరవాణి, యీ కుమారుండు దీర్ఘాయుష్మంతుండు ననేకాశ్వమేధ

రాజసూయయాగయాజియు వీర్యధైర్యశౌర్యగాంభీర్య మాధుర్యధారంధర్యాద్యనేక కల్యాణగుణనిధియునుం గాంగలం డని సకలజనంబులు వినునట్లు లుచ్చైఃస్వరంబునం బలికె. అట్టి కుమారు నిట్లు పేక్షింపందగదు. అది యగుంగాక. దేవర మృగయావినోదార్థం బరణ్యంబునకు విజయంబు సేసినయెడం బిత్రాశ్రమంబునం గన్యకనై వసించుచున్న నన్ను స్వీకరించితివి. నేను దేవరకుం దగిన సత్కులప్రసూత నింతె గాక నికృష్టజాత్యుద్భవురాలుగాను. [ఊర్వసి మొదలగు ప్రధానాప్సరసలలో మేనక యనునది బ్రహ్మ మానసపుత్రియు శ్రేష్ఠురాలును నగు, అయ్యంతికి మునిశ్రేష్ఠుం డగు విశ్వామిత్రునకు జనించి మహాత్ముం డగు కణ్వుని కారుణ్యంబునం బెరింగినదాన.] సంప్రాప్తయౌవనురాలై విధివశంబునం దండ్రి యసమక్షంబున నన్నుం గనుంగొని సత్యసంధుండ వగు దేవర వీయరానినమ్మికలిచ్చి గాంధర్వవివాహక్రమంబునం బరిగ్రహించితివి. అట్టి నేను గులంబును శీలంబును సత్యసంధత్వంబును స్వధర్మంబును నెంచి దేవర నెరనమ్మివచ్చిన నన్నుం బలికిన పలుకులు బొంకుగావించి స్వధర్మంబుం బరిత్యజించి లోకనాథుండ వెట్లగుదు. దేవరనె నాథునిగాం గల నన్నేమియపరాధంబును ద్దేశించి పరిత్యజించెదవు. చిన్ననాండు తలిదండ్రుల నెడంబాసియు నిప్పుడుం దేవర నెడంబాసియు నెట్లు మనంగలదాన. అనన్యగతికురాలగు నన్నును బాలుండగు కుమారకుని సత్యసంధుండ వగు దేవరవు పరిత్యజింపందగుదె? అని పలుక

దుష్యంతుం డిటు లను. "విను శకుంతలా, నిన్ను నీకుమారకుం గుఱు తెఱింగిన వాఁడఁ గాను. అసత్యశీలు లగు వనితల మాటలు సత్యంబు లని యెవ్వరు చేయుఁగలరు? మఱియు నసత్యంబు లగు నిట్టి వాక్యంబులు నిర్లజ్జురాలవై మహారాజు గుణంబుల నెట్లులుగా నిందించెదవు. ఓ దుష్టతాపసి యెందే నియుం జనుము. అతి కృద్ధుండగు విశ్వామిత్రుఁ డెక్కడ? యప్సరోవర యగు మేనక యెక్కడ? తేజస్తిమిర న్యాయంబున వారికి స్నేహంబు సంభవించు టెట్లు? అథవా దైవయోగంబున వారల కుద్భవించితే యియు నిట్టి కార్మణ వేషంబు కలుగ నేర్చునె? అత్యున్నతశరీరంబును బలపరాక్రమంబును గలిగి సాలస్కంధంబుఁ బోలిన మిక్కుటం బగు పెక్కువగల యితండు స్వల్పకాలజాతుం డగు బాలుండగు టెట్లు? ఎందేనియుఁ గామచారిణియు బుంశ్చలియు నగు మేనకపుత్రిక వగు నీవు సత్కులప్రసూతురాల వగు టెట్లు? ఈ వృత్తాంతం బంతయు మా యపరోక్షంబునఁ బ్రవర్తించినది యని నీవె పలుకరించెదవు. విశేషించియు యోషిజ్జనంబులు కామైకనిరతులును క్రోధసమాకుల చిత్తులును నగుదురు. అట్టిపట్లఁ బాపి చింతలఁ జెప్పనేల? మహానుభావుం డగు కణ్వు నేల పేర్కొనియెదవు? నీయది నికృష్టకులం బగు కోకిలాపత్యంబుఁ బోలిక మాతృ పితృ పరిత్యాగంబుకతన దౌశ్శీల్యంబునఁ బ్రసిద్ధం బయ్యె. నీ యట్టి దుర్బుద్ధిఁ గణ్వుం డెట్లు పోషింపఁ జాలు? మహారాజసభామధ్యంబున నిల్చి యింతటి యసత్యంబు

లెట్లుగ్గడించెదవు. ఈ సభాసదులు మేమునుం వినఁజాల మెంతేనియుం జనుము. కాదయేని సువర్ణమణిముక్తావస్త్రాభరణాదులయందు నీ వలచిన యది గోరు మొసంగెద. మిగులఁ దడవు నీ వుండఁ జూడఁజాల నెంతేనియు జను” మనియె.

శకుంతల యిట్టులను, నోరాజ, ఆవగింజలఁ బోలు పరుని ఛిద్రంబులం గననేర్చువాఁడవు మేరుసమానంబు లగు స్వచ్ఛిద్రంబులఁ గనుంగొనఁగఁజాలవు. అప్సరఃశ్రేష్ఠురాలగు మేనక దేవతాస్త్రీయనంబరఁగు. అట్టి మేనక యుదరంబున జననం బొందినదాన నేను. మానవస్త్రీయం దుదయించిన వాఁడవు నీవు. భూచరుండవేను ఖేచరురాల నటు లగుట మనల తారతమ్యంబు మేరువర్షపసమానమై యుండు. మఱియును నీవు నను దేవవారాంగనపుత్త్రి వని నిందించితివి దాన నేమి? తొలి మీ కూటస్థుం డగు నాయువను వాఁడూర్వశీపుత్త్రుం డగుట యెఱుంగవే? దర్పణ దర్శనంబునం గాని యాత్మగతముఖవైరూప్యంబు మనుజుండు కనుంగొనఁ జాలఁడు. అటు కనుక సర్వలక్షణసంపన్నుం డగు మహాపురుషుం డాత్మస్తుతియుఁ బరనిందయుఁ జేయనోడు. అర్థంబు దృష్టాంతీకరించితి నింతియ కాక వేఱొం డని యెంచక క్షమింపుము. మర్త్యంబులు పాంసువర్షంబునం బోలె దుఃశీలుండు పరదూషణంబునఁ బరితుష్టుం డగు వృథాక్రుద్ధుండు నగు, సత్యధర్మపరిత్యాగియు నాస్తికుండు నగు ధూర్జనుం

గనుంగొని సజ్జనులు విషసర్పంబునుంబోలె వెఱచఱతురు కాని సాధుజనంబులకు వెఱవంజాలరు. ఎవ్వండు తా నుత్పాదించిన పుత్రు నిందించు దేవతలు వాని శ్రేయస్సు నపహరింతురు. అతండు కీడునం బొందు. అసజ్జను నన్నృతవాది సనాచారు నాస్తికుని వేదనిందకు నపవిత్రుడునంగలిపురుషుం డను సరించుంగాని సజ్జనులం జేరంజాలండు. దుశ్శీలుండగు పురుషుండు గుణంబు నాస్వాదింపంజాలక యవగుణంబుల మాత్ర మెంచు నింతెకాని గుణగ్రాహి కానేరడు. ప్రాజ్ఞుం డగు పురుషుండు పరగుణాగుణవిచారంబుల యెడల హంసంబు నీర గతక్షీరంబుం గ్రోలు కై పడి గుణగ్రాహి యగు నింతెకాని దుర్గుణంబుల నెంచండు మఱియు దుర్జనుం డాత్మవత్సర్వ భూతానియనెడు న్యాయంబున సకలజనంబుల దుర్గుణైకప్రధానులుగా నెంచు. మరియు నికృష్టు లగు పురుషు లుత్తములకీర్తి యను నగ్నిజ్వాలలం బరితపింతు రింతెకాని యాసజ్జనులంబోల సామర్థ్యంబు చాలక వారల నిందింతురు. దుర్జనుండు సజ్జనావమానంబున సంతుష్టుండగు. స్వవంశ ప్రతిపాదకుండును బిత్రూణవిమోచన కరుండును సకలధర్మైక కారణుండును నగుపుత్రుం డపరిత్యాజ్యుండు. మఱియు ద్వాదశ విధపుత్రుల యందు నౌరసక్షేత్రజదత్తులు శ్రేష్ఠులు వారు నరకార్ణ వమగ్నులగు పితరుల నోడపోలిక నుద్ధరింతురు. అటుకనుక నోరాజశ్రేష్ఠః సత్యధర్మకులశీలంబులం బరిపాలనంబు సేయం దలంచితివేని ఇట్టిపుత్రోత్తముం బరిత్యజింపకుము. మఱియు

నూఱుబావుల కల్పించుటకంటె నొక్కతటాకంబు ఉత్తమంబు, తటాకశతంబుకన్న నొక్క జన్నంబెక్కుడు. నూఱుజన్నంబులకన్న నొక సుపుత్రుం డధికుం డట్టి పుత్రశతంబుకన్న సత్యం బెక్కుడు. తొలి యశ్వమేధయాగసహస్రఫలంబును సత్యంబును దులదూఁగు నెడ సత్యం బెక్కుడయ్యె. సకల పుణ్యక్షేత్రాటనంబులును సకల పుణ్యతీర్థాటనంబును సత్యవాక్యసమానంబు కానేరవు. అటు కనుక సత్యంబుకన్న మిక్కుటంబు లగు నుత్తమ ధర్మంబులును నసత్యంబుకన్న మిక్కుటం బగు పాతకంబునుం గలుగఁజాలదని పెద్ద లుగ్గడింతురు. కనుక పరబ్రహ్మ స్వరూపంబును సకల ధర్మోత్తమం బగు సత్యంబు పరిత్యజింపకుము. ఓ మహారాజ చిక్కల్మషంబు ధర్మైకనిరతంబును గల్యాణకరంబును నగు నీహృదయంబె యీయర్థంబునకు సాక్షి యగు. అదియునుంగాక నీవు ననుగాంధర్వంబునం బరిణయించునప్పుడు సకల ధర్మదేవతా సాక్షికంబని నన్ను దిగనాడితివి గనుక యేను మందభాగ్యురాలను. ఎందేనియుఁ జనియెద. రాజా సుజీవికమ్మని క్రోధారుణితనేత్ర యగుచుఁ బుత్రసహితమై వెడలునంత క్రోధాగ్నిజ్వాలలు ధూమాకులమై మూర్ధానంబున వెడల నాస్థానంబు వెలువడె.

ఇట్లు శకుంతల వెడలునంత బుత్విక్పురోహితామాత్య యుక్తుండగు దుష్యంతునిఁగూర్చి యశరీరవాణి యిట్టు లను. "విను దుష్యంతా! యెవ్వనివలన నేపుత్త్రుండుద్భవించు నతం

డతనికి భరింపఁదగు నటుగనుక దౌష్యంతి యగు నీపుత్త్రకుని భరింపుము; శకుంతలయు సత్యంబు పలికెఁ బుత్త్రుం డన స్వకీయసర్వాంగవ్యాపక సుఖసంభవుం డగుకతన నితండుఁ దానెయగుటం జేసి నీవ యిబ్బాలకుండవు; నిను నీవ పుత్త్రరూపకు రక్షింపుము. అనన్యగతికు రా లగు శకుంతలను నింద సేయకుము. ...పతివ్రతారత్నం బగుశకుంతలను బురుషసింహుం డగునీపుత్త్రునిం భరింపుము. భరింపఁబడుటవలన నితండు భరతుం డనంబరఁగె. ఇతనివలన నీకులజులతీతులు జనితులు జాయమానులు భారతు లనంబరఁగుదురు. నీదు కులంబును భారతకులంబన బరంగు." అట్లు సమస్తదేవర్షిసమూహంబును శకుంతల పరమపతివ్రత యని మేఘగంభీరఘోషంబున ఘోషించిపుష్పవర్షంబువర్షించిరి. మహీకాంతుండునిట్లను దేవర్షి వాక్యంబులాకర్ణించి సింహాసనంబుడిచిడగ్గనలేచి జాఁగిలిమ్రొక్కి మంత్రిపురోహితాప్తసమస్తసభాసదులతో సకలదేవర్షి వాక్యంబులు వినవచ్చెగదా. యేనును శకుంతల పాతివ్రత్యంబును బుత్త్రుని నాత్మజుం డని తెలిసియు లోకాపవాదంబునకు వెఱచఱచి, తెలియ నని పలికితి నింతియ కాని వేఱొండుగాదు. అని దుష్యంతుండు సకలదేవర్షిమానవసమ్మతంబునఁ బుత్త్రుబిగ్గఁ గౌఁగిలించి శిరంబు మూర్కొని సకలజనసంస్తూయమానుం డగుచు శకుంతల నూఱడించి సాంత్వవచనంబుల నిట్టు లనియె. "విను దేవులసాని, తొల్లి మన మిరువురు ననన్యసాక్షికంబుగ నటుల గాంధర్వపరిణ

యం బగుటయు నీదు పాతివ్రత్యంబును నిక్కమూరుండు నాయాత్మజుం డగుటయుఁ దెలిసియు లోకాపవాదంబు పరిహరింపఁగోరియుఁ జిత్త శుద్ధిపూర్వకంబుగ నీదుపాతివ్రత్యపరిభావంబు ప్రసిద్ధంబు గావింపఁ దలంచియుఁ బేరోలగంబున నేను గినుకవాడమ నగ్గడించినపలుకులు బూషించుటగాఁ దలంపకు. మఱియుఁ బ్రాణనాయకుండు కోపగించినను దుదికి దండించినను బతివ్రతలోర్చుట పరమధర్మం బగు ననియా రాజపుంగవుండు నయ్యింతి నంతఃపురంబున కనిచి తాను రథంతరినామధేయురా లగు నిజజననికి శకుంతలావృత్తాంతం బంతయు నెఱింగించి వారల నాయమకు బ్రొక్కించి దీవనలు వడసె. అమ్మహారాజు శకుంతలాదేవిని సర్వాభరణభూషితురా లగునటుల గావించి కుమారరత్నం బగుభరతు శుభముహూర్తంబున భద్రాసనస్థుఁగావించి యౌవరాజ్యాభిషిక్తుఁ జేసిభూసురుల గోసువర్ణంబుల సంతుష్టులం గావించి మఱియు వేయిసంవత్సరంబులు సామ్రాజ్యభోగంబు లనుభవించుచుండె.

